పండిత శ్రీరామశర్మ ఆచార్య, మాతా భగవతీదేవిగార్ల సంరక్షణలో

# యుగసంధి ప్రబోధం

(యుగసృజేతల సింహనాదం)

సంపుటి :3 | మే 98 | సంచిక : 12




## ఋషిప్రణాళిక అవతరణకూటమి సంకేతాల స్థాపనా ప్రత్యేకసంచిక

భారతదేశం తిరిగి జగద్గురు పీఠాన్ని అధిష్ఠించి తీరుతుంది



# నివేదన

ఆత్మీయ యుగసైనిక సోదరీ, సోదరులారా ........... ఈ యుగసంధి సమయములో 'విశ్వశ్రేయస్సు'కు బాధ్యత వహిస్తూ శ్రీ R.K. గారు చేపట్టిన కార్యక్రమాలను ఎప్పటికప్పుడు అందించుటకు స్థాపించిన పత్రిక ఈ మన 'యుగసంధిప్రబోధం'. త్రిముఖి అని చెప్పబడే గురువు లక్షణాలయిన సర్వజ్ఞత్వం, సర్వవ్యాపకత్వం, సర్వసమర్థత అనే వానిని ఒక్కోదానిని సాధించుటకు ఒక్కో సంవత్సర కాలాన్ని తీసుకొని ఆ దత్తస్థాయికి, ఆ త్రిముఖిగాయత్రి స్థాయికి మన పత్రిక ఎదిగిందనటానికి చిహ్నంగా దత్తుని, త్రిముఖీగాయత్రినీ స్థాపన చేయటం మన పత్రికకు 3 సంవత్సరాలవయసు నిండడం, మూడవ సంవత్సరపు చివరి సంచికలో ఆ వివరాలు రావటము కాకతాళీయం కాదు. ఖచ్చితంగా గురువుల ప్రణాళికలో భాగంగానే ఇది జరిగింది. ఆ స్థాయి వచ్చిందనే దానికి మరో సంకేతమేనేమో పత్రిక కూడా అన్ని హంగులతో సింగారించుకుంటూ 'ఆఫ్‌సెట్' ప్రింటింగ్‌లోకి కూడా మారింది. ఈ పత్రిక గెటప్ మీకు ఆ విషయం స్పష్టం చేస్తుంది గదా! ముఖచిత్రం కూడా పంచరంగులలో హృదయాలను రంజింపజేయు విధంగా తీసుకురావాలని (త్వరలో) ప్రయత్నాలు జరుగుతున్నాయి. కావున చందాదారులను తప్పక పెంచవలసివున్నది. యుగసైనికులైన ప్రతి ఒక్కరూ ఈ పత్రిక చందాదారుగా చేరటమే కాక మీ బంధుజనులలో గానీ, మిత్రులలో గాని, ఆప్తులలో గాని మరొక్కరిని పత్రిక చందాదారుగా చేర్పండి. ఈ మహాయజ్ఞంలో అత్యుత్తమ ఫలితాలు సాధించేందుకు 'చందాదారులనే' ఆజ్యాన్ని మీరు సంప్రోక్షణగాని చేస్తే యజ్ఞ ప్రసాదాన్ని నలుదిశలా పంచే మహాకార్యాన్ని శ్రీ R.K. గారు వేగంగా ముందుకు తీసుకెళ్ళగలరు. కావున యుగసైనికులైన మీరు జూలువిదిల్చి ఒక్కసాగి సింహనాదంచేస్తూ వెంటనే కార్యరంగంలోకి దూకండి. కనీసం వెయ్యిమందిని క్రొత్త చందాదారులను చేర్పించే మహాయజ్ఞానికి మీచేయుతనివ్వండి. అలాగే ఎన్నాళ్ళనుండో మన మిత్రులు సాహిత్యాన్ని బాగా ప్రోత్సహించాలి అంటున్నారు. వారి కోరిక మేరకు 'సాహిత్య ప్రోత్సాహక మండలి' ఒకటి ఏర్పాటు చేయబడుతుంది. త్వరలో దాని పూర్తి వివరాలు ప్రకటించబడతాయి. వీలయినంత వరకూ ప్రతియుగసైనికుడూ జీవత సభ్యత్వం స్వీకరిస్తూ మరొక క్రొత్త సంవత్సర చందాదారుని లేక జీవితచందాదారుని చేర్పించాలని కోరుతూ .............. శెలవు.

ఇట్లు
మీ ఎడిటర్

జై మహాకాల్ - జై జై మహాకాల్



# R.K. Letter :

27-4-98, సుకృతావిల్లా,
50, వేణుగోపాల్‌నగర్,
గుంటూరు - 522 006
1045 A.M.

ఆత్మీయ యుగసైనికులారా !

గడచిన ఏప్రియల్ నెల మనకు ఒక అద్భుతమైన ఉత్సాహాన్ని, కార్యప్రణాళికను అందించింది. తెలుగు సంవత్సరాది అయిన ఉగాదిరోజున ఋషిప్రణాళిక అవతరణ కూటమి కార్యక్రమము భూమి మీద ఋషుల అవతరణకు నాంది పలికింది. సప్తఋషుల ప్రణాళికయైన ఒకే విశ్వము, ఒకే ధర్మము, ఒకే భాష అనే సమన్వయబీజాలు ఈ రామ నవరాత్రులలో ప్రతి ఒక్కరూ తెలుసుకొనగలిగారు. 12 విభాగములు నిర్దిష్ట కార్యక్రమాలను పూర్తి చేయుటకు ఏర్పడ్డాయి. అవి :

1. Ministry of Astrology (జ్యోతిషశాస్త్రము)
2. Ministry of Heirarchy (ఋషి అవతరణ కూటమి)
3. Ministry of Finance (ఆర్థికశాస్త్రము)
4. Ministry of Health (ఆరోగ్యము)
5. Ministry of Education (విద్య)
6. Ministry of yajnas (యజ్ఞాలు)
7. Ministry of Cultural activities (సాంస్కృతిక కార్యక్రమాలు)
8. Ministry of Small Scale Industries (చిన్నతరహా పరిశ్రమలు)
9. Ministry of Environments (పర్యావరణము)
10. Ministry of Human Resources (మానవ వనరులు)
11. Ministry of Vedas (వేదాలు)
12. Ministry of Religion (విశ్వధర్మస్థాపన)

స్వంత బాధ్యత మీద ప్రతి ఒక్కరు ఈ కార్యక్రమములో పాల్గొనవచ్చును. ఎవ్వరూ మిమ్మల్ని బొట్టూ, కాటుకా పెట్టి ఈ బాధ్యతలను స్వీకరించమని బ్రతిమిలాడరు. కాళ్ళమీదపడరు. ఏక్రాంతికారినీ ఆ బాధ్యతలు స్వీకరించమని ఎవరూ అడగలేదు. స్వంత బాధ్యతతో వాటిని స్వీకరించి ప్రాణాలను సైతం సమర్పించారు.

ఋషిప్రణాళిక అవతరణ కూటమి ద్వారా ఉద్భవించిన శక్తితో అనేక కుటీరపరిశ్రమలు స్థాపించబడటమే కాక రేపల్లె వద్ద కొత్తపాలెంలో 24-4-98 వ తేదీ '**శ్రీ కలానిధి ట్రస్టు**' ఆవిర్భవించి సుమారు విభిన్న ప్రదేశములలో వున్న 26 యకరములలో 'రసేశ్వరాలయము', 'రాసేశ్వరీదేవి ఆలయము' చంద్రవిద్యాపరముగా 'శ్రీ విద్య' యొక్క బీజారోపణ, సమీప భవిష్యత్తులో సముద్రపు ఒడ్డున, కృష్ణానది ఒడ్డున సంజీవినీ విద్య బీజారోపణ చేయడానికి ప్రణాళికలు సిద్ధమైనవి.

వేటపాలెం వద్ద 25-4-98 వ తారఖున '**జ్ఞానసాగర ట్రస్టు**' ఏర్పడి, 3 అడుగుల ఎత్తుగల 'దత్త' విగ్రహాన్ని 5 రోజులలో ప్రతిష్టించి ఒక అద్భుతాన్ని సృష్టించడమే కాక 16

ఎకరముల స్థలములో 'జగద్గురు స్వరూప'మైన దత్తుని 16 అవతారముల ద్వారా సకల ప్రపంచానికి సృష్టికోటికీ కూడా వున్న ఒకే గురుసత్తా యొక్క ప్రాచీన కార్యక్రమాలను విశదీకరిస్తూ నూతన విశ్వధర్మస్థాపనకు మతాలన్నిటినీ ఏకీకరణ చేయుటకు కావలసిన అనుసంధాన కార్యక్రమము రూపుదిద్దుకుంది.

26-4-98 వతేదీ '**ధృవనక్షత్రసమాఖ్య**' తరుపున సుమారు 1 యకరంలో 'అంతర్జాతీయ కార్యాలయానికి '**సమర్పణ**' అను పేరుతో భవన నిర్మాణానికి పునాది వేయడమైనది. మేదరమెట్లలో వున్న పై స్థలానికి సుమారు 5 కి.మీ దూరంలో వున్న ఎర్రబాలెంలో సుమారు 18 యకరముల స్థలములో 'సూర్యకిరణ విజ్ఞాన అనుసంధాన కేంద్రము' జు॥BGYOR ACADEMY (సప్తరశ్మి పీఠం) అను పేరుతో అంకురార్పణ జరిగినది. అదేరోజున సింగరకొండ వద్ద 'శ్రీ జగన్మాతృకాపీఠం' సుమారు 4 ఎకరముల స్థలములో ఏర్పడింది. 6-5-98 ఉదయానికి అక్కడ త్రిముఖీ గాయత్రీ స్థాపన, 3 కుటీరాలు తగువసతిలో ఏర్పడి 108 యజ్ఞ కుండాలతో ఒక కార్యక్రమం జరిపించటానికి 'కార్యచరణ సభ్యులు' నిర్ణయించారు. ఇంతేకాక 41 రోజులలో అనగా జూన్ 6వతేదీనాటికి 24 జగజ్జనని యొక్క గాయత్రీ మంత్రాక్షర పీఠములు కూడా స్థాపించబడి 5 రోజుల సాధనాశిబిరముతోపాటు 'మహోత్సవ' కార్యక్రమాలు జరిపించబడతాయి.

ఋషి ప్రణాళికా అవతరణ కూటమిలో ఆవిర్భవించిన శక్తిధారలు నెలతిరగక ముందే చూపించిన ఈ పరిణామాలు భూమిమీద సప్తఋషుల అవతరణ జరిగినది అనటానకి నిదర్శనము. యుగసైనికులమైన మనము ఈ నవరాత్రికి ఈ క్షేత్రాలన్నీ సక్రమమైన కార్యక్రమములు నిర్ధారించుకొని దేవీనవరాత్రి శక్తిధారలను కూడా ఆయా స్థలములలో దింపుకొని ఒక అంతర్రాష్ట్రీయ (international) చైతన్యధారకి ఆనకట్ట నిర్మిద్దాం. యుగసైనికులైన మీకు ఇప్పటికే మీ శక్తి అర్థం అవుతుంది. (కలలు కనేవారిని మినహాయించి) మీ శక్తిని సక్రమముగా చూపిస్తారని ఆశిస్తూ ......................

**మీ శ్రీరామకృష్ణ**

**P.S. : 6**-5-98 త్రిముఖీ గాయత్రీ స్థాపన 108 కుండీల గాయత్రీ హవన యజ్ఞము జరిగినది ... ఎడిటర్

## యుగసైనికులారా పరాక్రమించండి

పత్రిక నడవపటం ఎంత కష్టమో మీకు తెలియనది కాదు. అందునా అతి తక్కువ కాపీలతో నూతనముగా R.K. వాణిని విశ్వవ్యాపితము చేసేందుకు సంపూర్ణ సమర్పణతో మన ఆత్మీయ మిత్రుడు **సీతారాముడు** R.K. ఆదేశం మేరకు ప్రారంభించిన **'స్వర్ణయుగం'** పత్రికను ప్రోత్సహించండి. తీసుకోండి సంకల్పం. ప్రతీకార్యకర్త కనీసము 5 చందాలు పంపించుట అంత శ్రమేమి కాదు. సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వసమర్థుడు అయిన **'గురుసత్తా'** అనుగు పుత్రులైన మీరు **మీ సర్వసమర్థతను** ఒకసారి స్మరించుకొని ఒక హనుమంతునిలా, అర్జునునిలా విజృంభించండి. వెంటనే అనగా **జూన్ 1వ తేది కల్లా** ప్రతీ కార్యకర్త 5 క్రొత్త చందాదారులను చేర్పించే సంకల్పాన్ని నెరవేర్చండి. ఇది R.K. గారి మరియు మన 'గురుసత్తా' ప్రియపుత్రులందరి ఆకాంక్ష. వ్యక్తి, వ్యక్తి కదలి దీనిని సాధించండి.



# 'శ్రీ కలానిధి ట్రస్టు'

## చంద్రవిద్య విశ్వవిద్యాలయ స్థాపన :

ఈ ప్రదేశంలో కోట్లసంవత్సరాల క్రిందటే ఓ అద్భుత విశ్వవిద్యాలయం వుండేది. అది కాలచక్రంలో కలిసిపోయి నామరూపాలు లేకుండా పోయింది. తిరిగి మీరు ఈ రోజు ఆ చంద్రవిద్య విశ్వవిద్యాలయాన్ని మొదలుపెట్టుచున్నారు. గ్రహగతులు కూడా దీనికి అనుకూలమైన పరిస్థితులను కలిపిస్తూ కనిపిస్తున్నాయి. మృతసంజీవనీ గురువు శుక్రుడు, చంద్రుడూ ఒకే చోట ఉన్నారు. గమనించండి. సూర్యుడు, చంద్రుడు మనకోసము మాత్రమే కాదు ఉదయించేది, మొత్తము ప్రపంచం కొరకు ఉదయిస్తున్నారు. గ్రహగతులు కూడా అంతే. మొత్తము ప్రపంచం కొరకు జరుగుతుంది. ఆ గతుల ప్రకారం స్పందిస్తే చక్కని ఫలితాలు రాబట్టుకొనగలం. ఆ స్పందన మీనుండి వచ్చింది. ఈ అద్భుత క్షణాలను గుర్తించి స్పందించ గలిగిన మీరు ఎన్ని పూర్వజన్మల సంస్కారఫలితమో ఇది గుర్తించండి. ఒక సంవత్సరం తరువాత విదేశీయులు సహితం ఈ విద్య కొరకు ఇక్కడకు వచ్చినపుడు గర్వంతో చెప్పుకోగలరు. ఈ గొప్పదనాన్ని సాధించింది మేమే అని.

## మంగల్‌పాండే - స్వాతంత్ర్యాభిలాష :

1857 లో మీరట్ వద్ద ఓ చిన్న ఊరిలో ఒక రెజిమెంట్‌లో 'మంగల్‌పాండే' మొదటిగా అనుకున్నాడు. " ఈ తెల్లదొరలపాలన వద్దు. వీరి నిరంకుశ, కర్కశధోరణి సహించలేము. వీరిని దేశం నుండి వెళ్ళగొట్టాలి' అని. ఆ ఒక్కడి ఆలోచనా ఫలితం 90 సంవత్సరాల తరువాత భారతదేశానికి స్వాతంత్ర్యం తెచ్చిపెట్టింది. అలాగే ఈ రోజు కొత్తపాలెం వాస్తవ్యులు చేస్తున్న ఈ మహత్తర కార్యక్రమ విశిష్ఠత 5 సంవత్సరాల తరువాత భారతదేశస్థులే కాక విదేశీయులు సైతం విద్యను అభ్యసించ వచ్చినపుడు గుర్తిస్తారు. అయితే మొదలుపెట్టటం చాలా ఈజీయే. కానీ చివరివరకూ లాక్కురావటమే కష్టము. చేయబోయేపని ఎంత గొప్పదో అర్థం అయితే ఎంత కష్టం అయినా భరించగలము. ఫలితం సహస్రాంశం వున్నప్పుడు ఏకాంశ కష్టానికి వెరవము కదా ! అయితే కష్టము ముందు తరువాత ఫలితం. విజ్ఞులు ఇది గుర్తిస్తారు కనుక కష్టపడగలరు. మీరూ విజ్ఞులే కనుక అలా కష్టపడటం మీరు చేయగలరని ఆశ.

## వేదవ్యాస - దుర్వాసుల వారసులుమీరు :

మనం ఇక్కడ ఒక యంత్రం పెట్టబోతున్నాము. ఇలాంటి యంత్రాలు వేదవ్యాసుడు, దుర్వాసులులాంటి మహర్షుల ఆశ్రమాలలోనే వుండేవి. అటువంటి యంత్రాన్ని ఇక్కడ ఏర్పాటు చేస్తున్నాం. మీరు అందరూ వేదవ్యాస, దుర్వాసుల వారసులు అయి వుంటారు. అందుకనే వారి పనులు కొనసాగించేందుకు సంకల్పించారు. ఇక్కడ నెలకొల్పే యంత్రం ముందు నిల్చొని గతించిన, సంభవించబోవు జన్మలు కూడా తెలుసుకోవచ్చు. ఇది ఒక గుడి కాదు. ఇది ఒక విద్యాలయం. అనేక జన్మల ఫలితాలు ఋషులు మాత్రమే కాదు, జ్యోతీశ్శాస్త్రమే కాదు ఇక్కడ నెలకొల్పే ఈ యంత్రం కూడా తెలుపగలదు.

**మృత సంజీవనీ విద్య :** మహాభారతంలో వున్న విద్యే యిక్కడ ఏర్పడనున్నది. శ్రీకృష్ణుడు సాందీపనీ ఆశ్రమంలో అన్ని విద్యలూ నేర్చాడు. అతని విద్య పూర్తి అయినది. దీక్షాంతసమారోహ సమయం వచ్చింది. కృష్ణుడే కాదు అనేకమందికి అది దీక్షాంతసమారోహం. మరి కృష్ణుడినే ఎందుకు చెప్పుకుంటున్నామంటే అతడు సాధించాడు కనుక. పూర్వకాలంలో విద్య అయిన తరువాత గురువులకు దక్షిణలిచ్చేవారు. దక్షిణ అంటే వందో, మూడొందలలో డబ్బు కాదు. మహాద్భుత జ్ఞానమిచ్చిన గురువుకి కాగితాలంటయ్యా యిచ్చేది? కాదు..... గురువుగారి మనోవాంఛితం నెరవేర్చుతారు. కృష్ణుడు గురువు వద్ద వెళ్ళాడు. ఏంకావాలో అడుగుదామని. ఆయన విచారగ్రస్తుడైవున్నాడు. పలకరించేందుకు కృష్ణుడంతటివాడికి దమ్ము చాల్లేదు. అదీ గురుశిష్య సంబంధమంటే. కృష్ణుడు గురుపత్ని వద్దకెళ్ళాడు. 'అమ్మా ఏమిటి గురువుగారి మూడ్ సరిగాలేదు. అవుట్ అఫ్ మూడ్‌లో వున్నారు. కారణం ఏమిటి?' అని అడిగితే ఆమె విచారవదనయై వెళ్ళి నీ గురువునే అడుగు నాయనా అన్నది. కృష్ణుడు సాహసించి గురువు వద్దకు వెళ్ళి కారణమడిగాడు "ఇదే రోజు 4 సంవత్సరాలకు పూర్వం పునర్దత్తుడు అనే నా కొడుకు సముద్రంలో కొట్టుకుపోయాడు ఎప్పుడు ఈ రోజు వచ్చినా గతం గుర్తు వచ్చి బాధకలుగుతుంది" అన్నాడు. 'అంతేనా!' అన్నాడు కృష్ణుడు. గురువు కంగుతిన్నాడు. నేను తీసుకువస్తాను. సముద్రంలో మునిగిచనిపోయిన మీ కొడుకుని సజీవుడని చేసి తీసుకువచ్చి అప్పచెపుతాను అన్నాడు. అలాగే అప్పగించాడు. ఏ విద్య ద్వారా పునర్దత్తుడిని బ్రతికించాడో, ఆ సంజీవినీ విద్య శుక్రుని వద్ద వున్నది. శుక్రుడు, చంద్రుడు, బుధుడు (గ్రహాలు) ఒకేచోట వున్న సమయం యిదే సరిఅయిన అదను. అందుకే తొందచేసాను.

**రసరాజు చంద్రుడు :** భగవద్గీత 15వ అధ్యాయంలో వివరంగా చంద్రవిద్య గురించి పరమాత్మ చెప్తాడు. ఇందులో 'శ్రీం' ప్రక్కన పెడితే 15 అక్షరాలలో చంద్రుడు ఓషధులలో ఓషధీరసాలను శక్తిని వాటికి చంద్రుడే ఇస్తున్నాడు. 16వ అక్షరమైన 'శ్రీం' బీజాక్షరంను 16 కోట్లు వ్రాయించి నైబుతిమూల ఒక స్థూపం నిర్మిస్తాము. ఈశాన్యంలో ......... సూర్యునికి, చంద్రుడికి మధ్య 15 కోణాలు ఏర్పడతాయి. అవే పాడ్యమి మొదటిది, విదియ రెండవది, తదియ మూడవది ఇలా చవితి, పంచమి .......... పూర్ణిమ లేక అమావాస్య - సూర్యుడు, చంద్రుడు ఎదురెదురుగా వున్నప్పుడు పూర్ణిమ, కలిసిపోతే అమవాస్య ఏర్పడతాయి. అమావాస్య, పూర్ణిమ మధ్య వున్నవానిని కళలు అంటారు. అందుకని ఇక్కడి పేరు శ్రీకళా(లా)నిధి. మరచిపోయిన చంద్రవిద్య, ఔషధ విద్యను గుర్తు తెచ్చుకునేందుకు స్థూపం, చంద్రమందిరం ఇక్కడ నిర్మిస్తాం. ఇక్కడ చంద్రుని 16 కళల గురంచి నేర్పే విద్య అభ్యసిస్తాము. షోడశ కళావిద్య. ఈ విద్యనేర్చుకునేందుకు నిర్వహించే సాధనాశిబిరాలు నిర్వహించుకునేందుకు వీలగునట్లు ఏర్పాటు కట్టడాలు నిర్మిస్తాం. పాలరాయా, గ్రానైటా లేదా కుటీరాలా మీ యిష్టం. జస్ట్ వచ్చిన సాధకుల సాధనలకనుకూల వాతావరణం నిర్మించడమే మీ విధి. ఇక్కడ నాలుగు విషయలు మీరు గమనించాలి.

1. మహాభారతాన్ని ఒక విద్యగా అభ్యసించాలి.
2. చంద్రకళా విద్యని అభ్యసించాలి.
3. చంద్రుని పోషక రసాన్ని అభ్యసించాలి.
4. ప్రతి పూర్ణిమకు అనేకమంది సాధకులు సముద్రతీరంలో పాల్గొనే సాధనా కార్యక్రమాలనేర్పాటు చేయాలి.



# నాస్తికూలూ - వినండి

మీరు ఆస్తికులా నాకనవసరం, మీరు నాస్తికులా నా కనవసరం. మీరు ఎవరైనా నేను చెప్పేది అర్థంచేసుకోవటానికి ప్రయత్నించండి. ఏదైనా ఒక విషయం చర్చించాలంటే అసలు అర్హత వుందా లేదా అనేది చాలా ముఖ్యం.

**అస్తికుడు - నాస్తికుడు వాడు - వీడు , వీడు - వాడు !**

ఇప్పుడు నా జీవితం ఎలా పదిమందికీ మార్గదర్శకం అయిందో చెపుతాను. నా జీవితంలో మార్పుకి కారణమైన నేను చిన్నవాడు విన్న కథ వినండి. కాశీకి దగ్గరలో ఓ గ్రామం వుంది. అది 5, 6 వందల గడపల గ్రామం. ఆ గ్రామంలో ఒక ఆస్తికుడూ, నాస్తికుడూ వున్నారు, ఆస్తికుడు, ప్రతిరోజూ గ్రామస్తులతోమంచిగా బ్రతకండి. మనం చేసే మంచి చెడులను గమనించే భగవంతుడొకడున్నాడు. ఆయన అన్నీ చూస్తుంటాడు, పొరపాటుగా కూడా చెడు చేయకండి. మంచిగా బ్రతకండి. భగవంతుడిని పూలతో పూజించండి అనేవాడు సాయంత్రం నాస్తికుడు వచ్చి టాట్ ...... తీసేయండి. వ్యక్తి పూజ మేము చేయం, కారల్‌మార్క్స్ విగ్రహాలు పెడతాము. వ్యక్తి పూజ మేము చేయం, లెనిన్‌ని ఆరాధిస్తాము. మేము వ్యక్తిపూజ చేయం. మావో అంటే [illegible]. మేము వ్యక్తి పూజ చేయం. నక్సలిజాన్ని పూజిస్తాం. ప్రపంచంలో ఎవరైనా, ఏ వ్యక్తి అయితే ఆదర్శంగా బ్రతికాడో అతనిని ఖచ్చితంగా ఆరాధిస్తారు. ఒకటి గుర్తుంచుకోండి. అభిమానించకండి అని ఎవరికి చెప్పకండి. అభిమానించకంటే, ఖచ్చితంగా అభిమానిస్తారు. సరే వీరిద్దరి గొడవవింటున్న గ్రామస్తులు ఒక రోజు వీరిద్దర్ని పిలిచి " అలాకాదయ్యా రేపు రాత్రి మీరిద్దరూ కూర్చొని చర్చించుకొని ఇద్దరూ ఒక అభిప్రాయానికి రండి". అన్నారు. దానితో మరు రాత్రి ఇద్దరూ కూర్చొని తెల్లవార్లూ వాదించుకున్నారు. వాదించుకున్నారు......... చివరికి తెల్లవారింది. చర్చలు ముగిసినవి. రాగా, పోగా చివరికి ఏమయింది నాస్తికుడు ఆస్తికుడయ్యాడు. ఆస్తికుడు నాస్తికుడయ్యాడు. పాపం మరలా ఆ గ్రామస్తులకు ఆ ఇద్దరి బాధ తప్పలేదు. భగవంతుడున్నాడు. నేన్నమ్మను సరే యింగ్లీషులో 'ఏ' అనే అక్షరాన్ని 'A' ఇలా వ్రాస్తామయ్యా నేన్నమ్మను. యిటు ఒక గీత, అటుఒక గీత మధ్యలో ఒక గీత గీస్తే 'A' అవుతుంది. నేన్నమ్మను. B ఇలా వ్రాస్తాం. నేనమ్మను అంటే వాడిని ఏమంటాము మూర్ఖుడు అంటాము. ఏదైనా ఒక దానిని గురించి తెలుసుకోవాలంటే దాని యొక్క ప్రాథమికమైన లక్షణాలు తెలుసుకోవాలి. ఇది తెలియని వారు ఆ విద్యపరంగా వాదనలకు దిగితే వారిని మూర్ఖులనే అంటాము.

**దివ్యగుణాల ప్రేరకాలు సూర్యచంద్రశక్తులు :**

పంటలు ఎప్పుడు వేస్తాము. వర్షాలు రాగానే. మేము నమ్మవండి. శీతాకాలం దాటినాక వేస్తాం. వెయ్యండి. మీ యిష్టం మీది. కానీ అవి వ్యర్థం అవుతాయి. విత్తనాలు

మొలకెత్తుటకు వుపయోగపడిన శక్తి అది పక్వానికి వచ్చి పంటను పెంచుతుంది. అదే శక్తి మానవునిలోని దివ్యగుణాలను పెంపొందిస్తుంది. ఆ శక్తే సూర్యచంద్రుల శక్తి. ఇందులో నమ్మనిదేముంది. వాదనలెందుకు.

ప్రతివ్యక్తీ ఏ విధమైన మానసిక, శారీరక రుగ్మతలు లేకుండా ఆనందంగా బ్రతకాలి. అందుకు ఉపయోగించుకోండి చంద్ర విద్యను. మతిభ్రమణకు కారణం చంద్రుడు. ఇది ఈనాటి డాక్టర్స్ కూడా చెబుతున్నారు. చాలామంది పిల్లలు ఈనాడు సరిగా చదువుటలేదు. పోనీ వారికి డాక్టర్లు, ఇంజనీర్లు కావాలని లేదా? తప్పని సరిగా వుంది. మరి ఎందుకు చదవరు? అదుగో దానికి సమాధానం, మరియు వారి మానసిక స్థితులను Set right చేసుకునేందుకు వాడుకోండి ఈ చంద్రవిద్యను.

## చంద్రవిద్య - ఒక ప్రయోగము :

ఈనాడు క్యాన్సర్‌కు మందులేదు. దానికొరకు ప్రపంచవ్యాప్తగా కోటానుకోట్లడాలర్లు రూపాయలు కాదు డాలర్లు అదీ కోటాను కోట్ల డాలర్లు ఖర్చు పెడుతున్నారు. ఏదిమందు? తెలియదు ఎప్పుడు కనుక్కుంటారు? తెలియదు. అసలు కనుక్కుంటారా లేదా? తెలియదు. ఎన్నాళ్ళు పడుతుంది ? తెలియదు. ఈ తెలియదు అనే సమాధానం వచ్చే ఈ ప్రయోగం కొరకు కోట్ల డాలర్లు ఖర్చుపెడుతున్నారు. మరి అలా ఖర్చుపెట్టటం రైటా? తప్పా? రైటే .... రైటే అంటారు. అదుగో అలాంటి ప్రయోగమే ఈ చంద్రవిద్య. మానవజాతి అంతా సుఖసంతోషాలతో ఆనందంగా జీవించేవిధం అందించాలనే తలంపుతో కొంతమంది వ్యక్తులు కలిసి కొంతడబ్బు ఖర్చుచేసి ఈ చంద్రవిద్య కొరకు ఈ పాఠశాల పెడుతున్నారు. ఇందులో తప్పేం వుంది. వాదన ఏం వున్నది. ఈ మాటలు నేనంటున్నవి కాదు. అమెరికా వారి 'నాసా' సెంటర్ వారు అంటున్నారు. భారతదేశం నుండి మనం నేర్చుకోవలసిన జ్ఞానం చాలా వున్నదీ అని. అయినా మేం నమ్మం. నమ్మకండి. వాళ్ళు నేర్చుకున్నాక వాళ్ళవద్దనే మీరూ నేర్చుకోండి. కాదనేదెవరు.

## రచనాత్మక కార్యక్రమాలు చేయండి :

లేదూ ...... మేము కూడా సమాజానికి మేలుచేసే విధంగా కృషిచేస్తాం అంటారా చెయ్యండి. మా వాళ్ళు మీకు సహకరిస్తారు. త్రాగుబోతులు వద్దు, ఉద్యమించండి. బందులు వద్దు దానితో సాధించేదేమీ లేదు. కొట్లాటలు, తలలుతీయటాలు, బస్‌లు, రైళ్ళు పేల్చటాలూ వద్దు. అవి సమాజ వినాశనానికే గాని వుపయోగకరమైనవి కాదు. కనుక ఏ విషయం పైన అయినా 'రచనాత్మక కార్యక్రమాలు' తీసుకురండి. మేమూ మీతో కలసి పనిచేస్తాం. అది లేదు. వాదనలు ............ వాదనలు, ఎందుకయ్యా ఈ వ్యర్థ వాదనలు? అంతతీరిక ఎక్కడుంది? నాకు లేదు. మీకుందేమో గాని.

చేయగలిగితే చేయండి. లేదా మాతో చేయి కలపండి. అందరం కలసి ఈ భువిని దివ్యంగా మారుద్దాము. లేదూ ............ మీ దారిలో మీరు నడవండి. మా దారితో మేము నడుస్తాం. ఇద్దరి దారులూ కలిసాయా, కౌగిలించుకుందాం లేదా ఎవరిదారి వారిది. మీరు మీ దారిలో అద్భుతాలు సాధించారా ........... మేమూ మీతో కలుస్తాం. అందరం కలసి వుందాం. ఇందులో ఎవరికి ఎవరూ శత్రువులు కాదు. అందరం మిత్రులమే అందరం కూడా మానవకళ్యాణం కొరకు ముందుకునడుద్దాం. శ్రమిద్దాం. అని కోరుకుంటూ స్వస్తి

**(కొందరు నాస్తిక మిత్రులు R.K. గారిని కలిసి ప్రశ్నించినపుడు వారికి సమాధానంగా చెప్పిన దాని సారాంశం ఈ వ్యాసం)**



# జగద్గురు జ్ఞానసాగరపీఠం

వేటపాలెం నందు 25-4-98 వ తేదీన ఈ జగద్గురు జ్ఞానసాగరపీఠం శ్రీ R.K. గారు స్థాపన చేయటం జరిగింది. ఆ సందర్భంగా వారిచ్చిన వివరణ.

**యుగసంధి కాలము** : మనం కొన్ని సంవత్సరాలుగా 'యుగసంధి' గురించి మాట్లాడుకుంటున్నాము. ఇది ప్రకృతిలోని ఒక ధర్మం. సూర్యోదయ, సూర్యాస్తమయాలు ఎలా జరుగుతున్నాయో, రోజులూ, నెలలూ, సంవత్సరాలూ ఎలా జరుగుతున్నాయో అలాగే కొన్నివేల, లక్షల సంవత్సరాలకు యుగాలు కూడా మారతాయి. ప్రకృతిలోని ఏ సంఘటనా కూడా మనిషి మూడ్స్‌బట్టి జరగదు. అది దాని ప్రకారం అది జరిగిపోతుంది. అది అర్థం చేసుకోవాలి.

సూర్యోదయానికి ముందే లేస్తే సూర్యోదయాన్ని చూడగలడు. అప్పుడు సంభవించే వానిని వుపయోగించుకోగలడు. నిద్రలేవలేదు. ఏమవుతుంది తెల్లవారుతుంది. సంధికాలం దాటుతుంది. మరి అలా నిద్రలేవకుండా బాధ్యత గలవ్యక్తి [illegible]డలేదు కదా? బాధ్యత గల వ్యక్తి సూర్యోదయానికి ముందే లేచి తలుపులు తీసి పాలవాడు, పనిమనిషి తదితర విషయాలన్నీ చూసుకుంటారు. అలా చేయకపోతే ఏమవుతుంది? ఏమీ కాదు పనిమనిషి వెళ్ళిపోవచ్చు తలుపేసుందని. పాలు ప్రక్కింటి వాళ్ళు అవసరమని పాలవాని వద్దపోయించుకోవచ్చు మనవి కూడా! అందుచేత బాధ్యతగల వ్యక్తి సంధికాలాన్ని తప్పక వుపయోగించుకుంటాడు.

అదుగో ఈ 'యుగసంధి' కాలంలో మొత్తం విశ్వానికే బాధ్యతవహించి మనం పనిచేస్తున్నాము. అందరూ చేస్తారా! లేదు బాధ్యత గలవారే చేస్తారు. ఏం మార్పులు వస్తున్నాయి. చీకటిపోయి వెలుగులు వస్తున్నాయి. అజ్ఞానమనే అంధకారం నుండి, కష్టాలు, బాధలు, అవినీతి, స్వార్థం అనే అంధకారం నుండి జ్ఞానమనే వెలుగుతో సుఖాలు, ఆనందాలు, నీతిమయ, నిస్వార్థమనే వెలుగులు రానున్నాయి.

**భారతదేశ దివ్యసందేశం** : ఆది నుండి ప్రపంచానికి భారతదేశం ఒక దివ్యసందేశం ఇస్తుంది. 'జగద్గురువు' అనే పదం. 'గురువు' అంటే చీకటిని పోగొట్టేవాడు ప్రపంచం (విశ్వం) యొక్క అజ్ఞానాన్ని పోగొట్టి విజ్ఞాన జ్యోతి వెలిగించటం యుగసంధి కాలంలో జరుగుతుంది.

ఈనాడు జ్ఞానం అన్ని మతాలలో వుంది. ప్రతిధర్మంలోనూ గొప్ప వ్యక్తులు వచ్చారు. క్రైస్ట్ గాని, మహమ్మద్‌గాని రాముడికి , కృష్ణుడికీ తీసిపోరు. కానీ వారి

అనుయాయులు వారి స్థాయిలో లేరు. ఋషుల స్థాయిలో మనంలేము. ఈ 2 సంవత్సరాల కాలంలో మనం చేస్తున్న పనులు చాలా వేగంగా మలుపు తిరుగుతాయి. కరెక్టు మలుపు తిరగకపోతే మరలా వెనక్కిరావలసి వస్తుంది. మళ్ళా చూసుకొని సరిగా మలుపు తిరగవలసి వుంటుంది. గురువులు యుగసంధి కాలంలో మనలో ఏ మార్పు కోరుకుంటున్నారో ఆ మార్పుకై ప్రయత్నిద్దాం.

ప్రొద్దునే లేచినవాడు మిగతా వారి కన్నా కొన్ని గంటలు ముందుంటాడు. మిగతావాళ్ళు ఎప్పుడో అనుభవించేవన్నీ ముందు అనుభవించగలడు. కానీ మనిషిలో వున్న ఒక బలహీనత తాను పాటించకుండా ఇతరులకు పాటించండి అని చెబుతాడు. మనం ఆ తప్పు చేయరాదు. జగద్గురు తత్వాన్ని ప్రపంచానికి తెలపాలి. ఎక్కడ ఏ మహాత్ముడు వుద్భవించినా ఒకే విషయం చెప్పారు. అది తప్ప అన్నీ చేస్తాం. ఈ దేహమే దేవాలయము. మహనీయులు ఎవరైనా నిరూపించేదేమంటే మీరు మీ అంతట గొప్ప వ్యక్తులుగా మారవచ్చు. మీ ఆలోచనలు మారకుండా గొప్పవాళ్ళుకాలేరు. మీ ఆలోచనలు మారిపోతే ప్రపంచం మారిపోతుంది. అది మరవకండి.

**జగద్గురుపీఠం ఇచ్చే సందేశాలు :**

1. "ప్రతి పనిని నేను తప్ప ప్రక్కవాడు చేయలేడు" అనే మానసిక స్థితి నుండి బయటపడండి. జరిగిన తప్పులనుగాని, జరగని సంఘటనలను గాని, అనుకోకుండా జరిగిన సంఘటనను గాని ఇతరులపైకినెట్టి వారిని బాధ్యుల చేయకండి.

2. ఒక పని మొదలుపెట్టి ఆపకండి. రేపు చేద్దాం అని వాయిదా కూడా వేయకండి. భోజనానికి టైం అయింది అని చేస్తున్న పని ఆపకండి. ఒక గంటలేదా 2, 3 గంటలు భోజనం తినకపోతే ఏం కొంపలు మునగవు. పని పూర్తి కానివ్వటం ముఖ్యం. అలా అని ఆ రోజు చేసినా పని కాదనుకున్నప్పుడు భోజనం మాని ఆ పని చేయకండి.

3. Rest (విశ్రాంతి) అనే పదం ఈ 2 సంవత్సరాలు మరచిపోండి. పని చేసాం అలసిపోయిం అని విశ్రాంతి తీసుకోకండి. చేస్తూ చేస్తూ పడిపోండి. పడిపోయి లేవగానే మరలా మొదలుపెట్టండి.

తరువాత నన్ను చాలామంది అడుగుతుంటారు. "మాష్టారూ ........ ఒక యోగం చేస్తూ చేస్తూ ............ పూర్తి కాకుండానే చనిపోతే ఏమవుతుందండి" అని, ఏమవుతుంది? .......... ఏమీ కాదు .......... మరుసటి జన్మలో, గతజన్మలో ఎక్కడ ఆగిపోయిందో అక్కడ నుండి మొదలు అవుతుంది. మనమందరం యోగభ్రష్టులమే. అందుకే ఆ యోగాన్ని పూర్తిచేసుకోవటానికి ఏకైక మార్గముగా ఈ జగద్గురువుని ఇక్కడ ఏర్పాటు చేసుకున్నాము. జగద్గురువు సమక్షములో చేసే సాధనలు ఈ 2 సంవత్సరాలలో సఫలీకృతము అవబోతున్నాయి.

**ఇక గురువుని వెతికే పనిలేదు :** ప్రపంచంలో వున్న ప్రతి ఒక్కరికి దత్త సాంప్రదాయంలోని సాధనలు ఈ జ్ఞానసాగరపీఠం అందించాలి. దత్త సాంప్రదాయంలో

వున్న అన్ని సాధనలు మీరు డిసెంబరు '98 లోపల చేయాలి. ఆ తరువాత మీరు ఇతరులచేత చేయించాలి. 20 వేల మంది ఎల్లప్పుడూ ఇక్కడ సాధనలకొరకు వుంటారు. వారందరికి 'జ్ఞానాన్ని' మీరు అందించాలి. ఇక్కడకు వచ్చిన ఏ వ్యక్తి అయినా ఇక గురువుని వెతుక్కునే పనిలేదు. మార్గదర్శనం మీరు చేస్తారు.

దత్తుని 16 కళలు, 16 అవతారాల సాధనా విధానం 2,3 నెలలలో అందిస్తాను. మీకు యిష్టం వచ్చిన సాధనలో స్పెషలైజ్ చేయండి. మామూలుగా ఒక స్టూడెంట్ అన్ని సబ్జక్టులను ప్రతిరోజూ చదువుకోవచ్చు. కానీ పరీక్షల సమయములో ఏ రోజుకారోజు ఆ పరీక్ష గురించే ప్రత్యేకంగా చదువుతాడు. అలాగే మీరు ఇప్పుడు ఈ పరీక్షా కాలములో ప్రత్యేకంగా దత్తసాంప్రదాయ సాధనలు చేయండి. సకల సమర్థసద్గురు విశ్వవిద్యాలములో మీరందరూ డిగ్రీ పూర్తిచేసారు. ఇప్పుడు పి.జీ చేస్తారు. P.G. లో ఒకే సబ్జక్టు గురించి చదువుతాము. అయితే దాని depth లోకి వెళతాము. మీరు ఎన్నుకున్న 16 మంది గురువులలో ఒకరి గురించి లేదా 16 మంది గురువుల సాధనలో పి.హెచ్.డి. చేయండి. అదీ మనం ఇక్కడ చేయబోయే మహాకార్యం.

**దత్త సంప్రదాయమంటే :** దత్త సాంప్రదాయంలో 112 సాధనలు వున్నాయి. ఈ 112 సాధనలలోనే ఈనాడు ప్రపంచంలో వున్న మత సాంప్రదాయాలు, సాధనలు వున్నాయి. దత్త సాంప్రదాయంలోని 112 సాధనలలో లేని మరేసాధనా కానరాదు. ఈ 'దత్త సాంప్రదాయాన్ని' ప్రపంచానికి సరిగ్గా మనం అవగాహన ఇవ్వగలిగితే ప్రపంచంలో నిలిచి వుండేది ఒకే 'మతం'. ఒకే సాంప్రదాయం, ఒకే సాధన, ఒకే దత్త సాంప్రదాయం. దీనినే వీరబ్రహ్మేంద్ర స్వామివారు 6 మతాలూ ఏకమౌతాయి అన్నారు. దైవత్వాన్ని బయటకు తీసే జీవిత విధానాన్ని మనం ఇక్కడ సాధకులకు నేర్పబోతున్నాం. అందుకు మనం అలా జీవించాలి. ఇందుకు ఓ చిన్న సాధన వుంది. పాతంజలి యోగశాస్త్రం నందు **'ప్రత్యాహారం'** అనుసాధన. నవల్స్ చదవండి. సినిమాలు చూడండి. దత్త ప్రదక్షిణలు చేయండి. సూర్యనమస్కారములు చేయండి. మీ మనసు దానిమీదే వుంచండి చాలు. మీ మనసు లేకపోతే కంగారుపడవలసిన పనిలేదు. మనసుని, ఇంద్రియాలను వుపయోగించకుండా ఏం చేసినా కరెక్టుగా చేయగలరు. అదే దత్తసాంప్రదాయమంటే.

**దత్త స్థాయి అంటే :** వందమందిని వుద్దేశించి మాట్లాడినపుడు ఎవరికి ఏ స్థాయిలో కావాలో వారికి ఆ స్థాయిలో అర్థం అయేలా, అనగా వందమందికి వందస్థాయిలలో (మాట్లాడిన అవే మాటలు) అందించగల స్థాయినే దత్త స్థాయి అంటాము.

అది ప్రస్తుతము దిగజారింది. దత్త సంప్రదాయం కూడా అలాగే దిగజారింది. మిగతా అవతారాలలా దత్తుడు కూడా మూడుతలలున్న ఒక అవతారం అని అనుకుంటున్నారు. చివరికి దత్త సంప్రదాయానికి ప్రతినిధులము మేము అనేవారు సైతం. అది ఒక అవతారం కాదు. అది ఒక స్థితి. ఈ స్థితి 'గురుబ్రహ్మ' (సర్వజ్ఞుడు) 'గురుర్విష్ణుః' (సర్వవాపకుడు)

గురుర్దేవోమహేశ్వరః (సర్వసమర్థుడు) సర్వజ్ఞత్వం సకల జ్ఞాననిలయం అయి వుండాలి. సర్వవ్యాపకత్వం అంతటా అనగా కుక్క, పిల్లి, పిట్ట, రాయి, చెట్టు అని అంతటా నిండి వుండాలి. సర్వసమర్థత్వం ఏవి? ఎలా? ఎక్కడ? ఎందుకు? ఎంత? చేయాలన్నా చేయగల సమర్థత కలిగివుండాలి. ఈ మూడూ సాధించిన 'గురుస్థితి' వుందే అదే దత్త స్థితి లేక దత్త స్థాయి అంటే.

**సమాధిస్థితిలో పనిచేయాలి :** ఆ దత్తస్థాయికి ప్రతిసాధకుడూ ఎదగాలి. ఎదిగేందుకు దత్తపీఠాన్ని ఏర్పాటుచేసాం. ఆలోచన వచ్చాక రేపు చేద్దాం అనుకుంటే అది ప్రకృతిలో ఎక్కడో ఒకచోట వెంటనే జరిగిపోతుంది. ఇలా యుగసంధి కాలములో మాత్రమే జరుగుతుంది. కనుక సాధనలు చేయాలి అనుకున్నాక ఆలస్యం లేకుండా మొదలుపెట్టి తీవ్రతర సాధనలు చేయండి. ఇంతసాధనలు చేస్తున్నాం కనుక ఇంటి పనులు ఎగకొడతాం అంటే కుదరదు. అదీ, ఇదీ రెండూ చేయవలసిందే ఎందుకంటే మీరు సర్వసమర్థులు కనుక. పునాది వేశాం కనుక సరిపోదు. 20 వేల మందిని సాధనా నిష్ణాతులను చేయు బాధ్యత మననెత్తిన వున్నది కనుక. ఈ రెండు సంవత్సరాలూ నాకూ, మీకు రెస్టు లేదు. ప్రత్యాహారస్థితిలో నిద్రపోకుండా వుంటే సమాధిస్థితి. సమాధిస్థితిలో పని చేయాలి. మిగతావాళ్ళంతా సమాధిస్థితికొరకు పనిచేస్తుంటే మనం దానిని ఉపయోగించుకుని పనిచేస్తున్నాము. దానినే ప్రత్యాహార ధ్యాన, ధారణ, సమాధిస్థితి అంటారు. వీనినే సంయమనం అంటాం.

వీటన్నిటినీ సాధించుటకే మనమిక్కడ జ్ఞానసాగరుని స్థాపించుకున్నాము. ఇక్కడ 16 మందికి 16 మందిరాలు నిర్మించండి. ఆ సాధనామయ జీవితంతో భువని దివిగా మారుద్దాం. ఆ విధంగా ముందుకు సాగుదాం. అందుకు మీరంతా సహకరిస్తారని ఆశిస్తూ స్వస్థి.

## ప్రజ్ఞాపురాణం

పూజ్యగురుదేవులు శ్రీరామశర్మ ఆచార్య విరచిత 'ప్రజ్ఞాపురాణం' తృతీయ ఖండమునందలి **'గృహస్థాశ్రమ ప్రకరణము'** 9వ పుస్తకముగా శ్రీమతి గౌరి సావిత్రి తెలుగులోకి అనువదించగా విశాఖపట్టణములో 30-4-98 శ్రీ N.L.N. మూర్తి గారి గృహప్రవేశ సందర్భముగా **'గురుకృప'** యందు శ్రీ మారెళ్ల శ్రీరామకృష్ణ గారు పై పుస్తకాన్ని ఆవిష్కరించడం జరిగింది. 'ప్రజ్ఞాయుగం' అవతరణ కొరకు పనిచేసే వ్యక్తులు, ప్రజ్ఞాపుత్రులు, ప్రజ్ఞాసైనికులుగా గురుదేవులచే పిలవబడేవారు ఎలాంటి కుటుంబసూత్రాలను పాటించడం ద్వారా విశ్వకుటుంబం వైపు పయనించుట సంభవమో తెలుపుమార్గదర్శక సూత్రాలను ఈ పుస్తకం తెలియజేస్తుంది.

# సప్తరశ్మి పీఠం
## (VIBGYOR ACADEMY)

(ఎర్రబాలెం నందు 264-98 ఉదయం 11.00 గంటలకు సప్తరశ్మి పీఠస్థాపనా సమయములో R.K. వుపన్యాసము నుండి)

అందరికీ భవిష్యత్ తెలుసు. భవిష్యత్ తెలియనివారు ఎవరూ లేరు. అవే మనం మహూర్తములు పెట్టుకోవటం, పిల్లలని చదివించడం. ఫలానారోజు పెళ్ళి అని నిర్ణయించగలం. నాలుగేళ్ళకో, ఐదు ఏళ్ళకో అబ్బాయి డాక్టరు అవుతాడని చెప్పగలగటం కూడా భవిష్యత్ చెప్పగలగటమే, కానీ దానిని సక్రమమైన పద్ధతిలో తెలుసుకో లేకుండా వున్నాము. ప్రకృతి శక్తులను వశపరచుకొని తనూ, తన కుటుంబము సుఖంగా వుండాలని మానవుని ఆశ. అదుగో ఆ ప్రకృతిని వశంచేసుకొని సంపూర్ణ మావనజాతికి పరిపూర్ణ ఆనందాన్ని అందించేందుకు సప్తరశ్మి పీఠం ఏర్పాటుచేయడమైనది.




ఆ+ఉ+మ = ఓంకారము : ఈ పీఠస్థాపనోద్దేశ్యం సాధించాలంటే చిన్న ఆలోచన మార్చుకోగలిగితే చాలు. మనం మెలకువగా వున్నప్పటి సంఘటనలు మాత్రమే గుర్తుంచుకో గలుగుతున్నాం. కలలస్థితి, గాఢనిద్ర స్థితిలోని సంఘటనలు గుర్తించలేకున్నాము. కలలచేతనత్వాన్ని మెలకువగా వున్న చేతనత్వముతో సరిచూసుకో గలగాలి. లలితా సహస్రనామంలో అక్కడ 'త్రిఖండిక' అని వస్తుంది. ఆ త్రిఖండికయే మీ మెలకువగా వున్న జీవితం, కలలజీవితం, గాఢనిద్ర జీవితం. అట్టి త్రి'భుజములు' గల త్రిభుజమే మనం ఆ బోర్డు మీద గీసింది. గాఢనిద్రలో జరిగిన సంఘటనలు గుర్తించి కలల తలంలోకి వానిని దింపుకొని వానిని మెలకువ తలములో గుర్తించ గలిగితే జీవితము సుఖంగా వుంటుంది. ఈ మూడు తలాలను వుపయోగించుకొనే విద్య కొన్ని కోట్ల కోట్ల సంవత్సరాలకు పూర్వం నుండి భారతదేశములో వున్నది. అయితే మరచిపోయాం. మరపు సహజం.

నేను 18 సంవత్సరాల నుండి స్టూడెంట్స్‌కి లెసన్స్ చెపుతున్నాను. నేను అదంతా ముందుగానే చదివాను. అందులో డాక్టరేట్ చేసాను. కానీ తిరిగి ఈ రోజు వారికి లెసన్

చెప్పాలన్నా ఒకసారి చూసుకోవాల్సిందే. కారణం మరిచిపోయాను. ఆ మరపుసహజం. తిరిగి దానిని గుర్తుతెచ్చే గురువే ఈ సప్తరశ్మి పీఠం. ఈ సప్తరశ్మి పీఠం అధిదాత సూర్యభగవానుడు. ఆయనను వుపయోగించుకుంటే అన్నీ, అంతా సర్వసిద్ధము.

**ఆదిత్య హృదయం విశిష్టత :** రామాయణంలోని ఒక సంఘటన మీకు చెపుతాను. యుద్ధరంగములో రావణుని కెదురుగా నిల్చున్నాడు రాముడు. రావణుని వైభవశక్తి ఒక్కసారి రాముడిని కూడా కలవరపరచింది. హనుమంతుడు లంకానగర ప్రవేశం చేయగానే ఒకసారి మనసు చలించింది. 'ఆహా ఏమి ఈ రావణుని వైభవం. ఎంత అద్భుతం. నాకర్మగాలి ఆ రాముడికి సేవకుడనయ్యా గాని, త్రిలోకాలలోనే అత్యంత వైభవశోభితుడైన ఈ రావణుని అనుచరుడనైతే ఎంత బావుండేది' అని క్షణం తలచాడు. మహాభక్తుడు, సమర్పణకు ప్రతీక అయిన హనుమంతుడినే కలవరపరచింది రావణుని వైభవతేజస్సు. అలా కలవరపడుతున్న రాముడి వద్దకు ఒక ఋషి వచ్చాడు. ఆయన మన ఆంధ్రులకు సంబంధించినవాడు. లలితా సహస్రనామం, అవీ అందించిన వాడు. ఆయనే **అగస్త్యుడు.** వచ్చి 'కలవరపడకు రామా! ఈ సకల ప్రపంచాన్ని నడిపే ఒక శక్తి వుంది. దాని హృదయాన్ని పట్టేసుకో గలిగితే ఈ రావణుడేమిటి? దేనినైనా సాధించవచ్చును. ఇదీ, అదీ అని లేకుండా ఏ కార్యాన్ని అయినా సాధింప వీలగు శక్తి అది. సకలశుభాలను, కీర్తులను, శౌర్యాలను ఇస్తుందది. ఆ శక్తి యొక్క హృదయాన్ని పట్టుకోగల్గితే **ఇక సర్వం నీ గుప్పెటలోనే వుంటుంది.** అదే 'ఆదిత్యహృదయం'.

అశ్మిన్‌క్షణే.......... ఆ క్షణంలోనే సాధించవచ్చు. ఇది చాలా పురాతనమైనది.' అని ఆ తరువాత రాముడు ఏమి సాధించాడో మీకు తెలుసు.

**సూర్యశక్తి వినిమయం :** అదుగో అలాంటి అసాధ్యాలను సుసాధ్యం చేయగల విద్యను నేర్పే సాధనాలయమే ఈ 'సప్తరశ్మీపీఠం'. సూర్యశక్తియే ఎవరికి ఏ మేలు జరిగినా వెనుక వుండేది.

మహాభారతంలో పాండువులు వనవాసం చేసేటపుడు దుర్వాసుడు వచ్చాడు. ద్రౌపది అక్షయ పాత్ర నుపయోగించిందపుడు. అది పాండవులకు సూర్యుని వలన 'దౌమ్యమహర్షి' యిప్పించాడు. అలాగే 'శమంతకమణి' రోజుకి 21 మణుగుల బంగారాన్ని ఇస్తుంది. ఆ శమంతకమణి సూర్యుని నుండి వచ్చిందే. సర్వజగత్తుకూ పోషణకర్తయైన ఆ సూర్యుని యొక్క 7 కిరణాల విజ్ఞానాన్ని వ్యక్తిగత, కుటుంబగత, జాతీయ సమస్యల పరిష్కారం కొరకు ఎలా వుపయోగించు కోవాలో నేర్పే విద్యకు యిక్కడ బీజాలు వేసాము.

వేద విజ్ఞానాన్ని తెలిపిన వ్యాసుడు కూడా సప్తఋషి కిరణాలు ఎలా వుపయోగించుకోవాలో చెప్పాడు. 'భవిష్యత్‌పురాణంలో' వేదవ్యాసుడు వివరించాడు. ఈనాడు ఆయన అందించిన 'సప్తకిరణాల' విజ్ఞానాన్ని ప్రపంచంలోని ప్రతివ్యక్తికి అందించే పనిని మనం తీసుకున్నాము. ఈ బృహత్ ప్రణాళికలలో మనందరం భాగస్వాములమవుదాం.



# దేవతత్వాన్ని వరించండి



విశ్వమండలి శక్తులు కొన్ని వినాశానికి, కొన్ని ఉన్నతికి కొన్ని పతనానికి నిరంతరం క్రియాశీలంగానే ఉంటూ ఉంటాయి. వీటినే దేవ, దానవులుగా, స్వర్గ, నరకములుగా చెప్పుకుంటూ ఉంటాం. మానవుడు ఈ రెంటిలో దేనినైనా ఎన్నుకోవటానికి తగిన స్వేచ్ఛ కలిగి తన సుఖశాంతులకు గానీ పతన పరాభవాలకు గానీ తానే కారకుడవుతాడు. మంచికీ, చెడుకూ కూడా సహాయ సంపత్తులు సమానంగానే అందుబాటులో ఉంటాయి. ఈ విభూతిని కలిగి ఉండటం వల్లనే మనుష్యుడు తన భాగ్య నిర్మాత, భవిష్య నిర్మాత తానే అవుతున్నాడు. తనకు, తన సముదాయానికి విపన్నతగానీ, సంపన్నతగానీ తానే చేకూర్చుకుంటున్నాడు.

మనిషి సాధారణముగా మంచి జరిగి, లాభం కలిగినప్పుడు అదంతా తన ప్రయోజకత్వమే నంటాడు. చెడుజరిగి, నష్టం కలిగినప్పుడు నిందను భగవంతుని మీద వేస్తాడు. దీనినే ఆత్మవంచన అంటారు.

క్రియ శరీరంతో జరుప బడుతుంది. ఆలోచన మస్తిష్కం ద్వారా జరుగుతుంది. అందువల్ల ఈ రోజులకు తగిన ప్రేరణను అంతరాళపు లోతుల దా[illegible] పొందాలి. అగ్ని పర్వతాలు ప్రేలటం, భూకంపాలు రావటం, భూమి అంతరా[illegible] మార్పుల వల్లనే జరుగుతుంది. వర్షం పొలాలమీదా, భూమి మీదా కురిసినా ఉల్పన్నమయ్యేది సముద్రంలోనే.

పరిస్థితుల మంచి చెడులు క్రియాకలాపాలపై ఆధారపడి ఉంటుంది. క్రియ జరగడానికి ప్రణాళికలు వేసేది మస్తిష్కం. అమలు జరిపేది శరీరం. ఈ రెంటికి సూత్రధారి అంతశ్చేతన యందలి ఆకాంక్షలు.

పరిశ్రమలు పెరిగిపోతున్నాయి. మంచిదేకానీ వాటివల్ల కలిగే వాతావరణ కాలుష్యాన్ని, నిరుద్యోగాన్ని గురించి కూడా ఆలోచించాలి. సాహిత్య సృజనం, సినిమాలు తీయడం మంచిదే, కానీ వాటివల్ల హింస, దౌర్జన్యం, అవాంఛనీయతలు, హత్యలు, మనభంగాలు పెరిగిపోవటం శోచనీయం.

పెరిగిపోతున్న యుద్ధోన్మాదం, విస్తరణ కాంక్ష, టెర్రరిజం, డ్రగ్స్ మొదలైన వాటిని గురించి జాగ్రత్తగా ఆలోచించాలి.

పశుపక్ష్యాదులను ఆహారంగా స్వీకరించేవారు, నరమాంస భక్షకుల పాలబడితే తమ గతి ఎలా ఉంటుందని ఆలోచించాలి. బిడ్డలను కనటానికి భార్యపడేపాట్లు పతిదేవుడు గమనిస్తున్నాడా? ఆ స్థితి తనకే వస్తే ఎలా ఉంటుందో కొంచెం ఆలోచించి కుటుంబనియంత్రణ పాటించాలి. భార్యకు గౌరవం, ఆదరణ లభింపజేయాలి.

ఈ విధంగా భావసంవేదనలు మానవాంతః కరణలో ఊరి జాలువారడం ప్రారంభిస్తే, ఆలోచనా ధోరణి మారుతుంది. ప్రవర్తనలో మార్పు వస్తుంది. వసుధైవ కుటుంబక భావన విస్తరిస్తుంది. భువిస్వర్గంగా మారుతుంది. మానవులు దైవమానవులవుతారు.

# శ్రీకృష్ణుడు - ఇతర అభివ్యక్తలు



**క్రీస్తు - కృష్ణుడు :**

కృష్ణుని విషయానికి వస్తే అతనిని అతని ఆవిష్కరణ శీల సంప్రదాయాన్ని క్రీస్తుమూర్తి, క్రైస్తవ సంప్రదాయం చేత అంచనా వేయడం సంభవం కాదు. వారు రెండు భిన్న ప్రపంచాలకు చెందినవారు. గీత యందు మనకు మహోన్నత, సీమారహిత, సర్వశ్రేష్ఠ ఆధ్మాత్మిక జ్ఞానము, సాధనశక్తి కన్పించుతాయి. వీటితో పోల్చదగిన దేదీ? అలాగే గోపి సంకేతమూ, దాని వెనుకనున్న సమస్తభావములకు ఏ భావిక బలము, తీవ్ర అనురాగము, పరమ సౌందర్యము గలవో, వాటితో పోల్చదగిన దేదీ క్రీస్తునందు లేదు. ఇంకా కృష్ణమూర్తి యొక్క బహుముఖ అభివ్యక్తికి గలదేదీ క్రీస్తునందు లేదు. క్రీస్తునకు ఇతర గుణాలున్నాయి. ఉభయుల గుణాలను ఎదురెదురుగా నిలిపి, వాటి బరువును తూచడానికి ప్రయత్నించి నందువల్ల కలిగే ప్రయోజనమేమీ ఉండదు. అది క్రైస్తవులలో, స్టాన్లీ బోన్సీ వంటి మిక్కిలి ఉదార క్రైస్తవులలో సైతము జీర్ణించుకుపోయిన తీవ్రత. పాపం వారు శాఖీయ సంకుచితతత్వం నుంచి పూర్తిగా తప్పించుకోలేరు. ప్రతి అవతారాన్ని తన స్వీయ ప్రపంచానికి వదిలివేసి, మానవులు తమ అంతరాకర్షణను బట్టి తమకు అనుకూల అవతారాన్ని అనుసరించడానికి సమ్మతించలేరు.

స్పష్టముగానే మతాలు కట్టే గోడలు ఒక పెద్ద దోషము, ఒక రోగసంచయము, సత్యానికి మనస్సు కల్పించే పరిమతి. ఇవి ఒక మానసిక ప్రయోజనాన్ని సాధించగలవేమో గాని, ఆధ్మాత్మిక ప్రయోజనాన్ని కాదు. అవతారము, గురువు, పరమాత్మకు ప్రాతినిధ్యం వహించాలి, అలా కాకపోతే, వారికి అర్థమే లేదు. అలాంటి వారు గావుననే వారు తమ ఆరాధకులకు, శిష్యులకు అవతారాలు, గురువులు అవుతున్నారు.

కాని క్రీస్తు కృష్ణులు ఒకటే అయినా వారి ఏకత యందు భేదం ఉంది. ఈ క్రైస్తవ మత ప్రచారకులు కోరే విధంగా ఒక అవతారం మాత్రమే కాక, అనేక అవతారాలు రావడంలోని ఉపయోగిత అదే.

**కృష్ణుడు - రాముడు :**

కాదు నిశ్చయంగా కాదు - అవతారం ఆధ్యాత్మిక ప్రవక్త కావలసిన అగత్యం లేదు - అతడు నిజానికెప్పుడూ ఒక ప్రవక్తమాత్రుడు గాదు, అతడు కార్యసాధకుడు, ప్రగతి స్థాపకుడు, అతడు బాహ్యము నందు గూడ కొంత సాధించుతాడు గాని, బాహ్యవస్తు సాధకుడు మాత్రమే గాడు. భగవంతుని దిశగా అనుక్రమిక దశల ద్వారా దేహధారి జీవిని ఏ పరిణామమిచ్చుట గలదో, ఆ పార్థివ పరిణామానికి అవశ్యకమగు అంతర మౌళిక, కార్యాన్ని అతడు ప్రధానంగా సాధించుతాడు అని నేను చెప్పే ఉన్నాను.

పరిణామము యొక్క ఆధ్యాత్మిక దశను స్థాపించడం రాముని కార్యం కానే కాదు - కావున అతడు దానితో ఎట్టి సంబంధమూ పెట్టుకోలేదు. అతని కార్యం రావణుని తుదముట్టించి, రామ రాజ్యాన్ని స్థాపించడమే. వీరి మాటల్లో స్వాతిక నాగరిక మానవజీవునికి

అనురూపమగు వ్యవస్థ - సంభవతను భావితరాల నిమిత్తం స్థాపించడమే ఆ కార్యం. ఈ సాత్విక మానవుడు హేతుబుద్ధి, శుద్ధభావములు, నైతిక శక్తులచేత తన జీవనాన్ని పాలించుకుంటాడు. లేక కనీసం సత్యము, విధేయత, సహకారము, సామరస్యము, అలాగే గృహవిషయక, సార్వజనిక వ్యవస్థను గురించిన దృష్టి. ఇట్టి నైతిక ఆదర్శాల చేత పాలించుకుంటాడు. ఇప్పటికీ ప్రపంచాన్ని అరాచకశక్తులు, అనగా పశుమనస్సు, తన స్వీయతృప్తినే జీవన నియమం గావించుకున్న ప్రాణిక అహంకారము, వీరు మాటల్లో వానరుడు, రాక్షసుడు ఆక్రమించి ఉన్నాయి. ఇట్టి ప్రపంచంలో రామరాజ్యాన్ని స్థాపించాలి. ఇదే రామునికి, అతని జీవిత కార్యానికి అర్థము. ధార్మిక క్షత్రియుడు తనకంటె తక్కువ వాటిని చంపడు గాన, భయంకర అజ్ఞానమయ పశువైన వారిని బుజ్జగించడం గాక, అతనిని వధించి, పశుభావంపై నియంత్రణ స్థాపించడమే అతని కార్యం. పరిపూర్ణ మానవుడుగా వ్యవహరించడం అతనికి ఆవశ్యకం గాదు. సాత్విక మానవుడు మొత్తం మీద ఎలా నడుచుకుంటాడో, అలా ఒక విశ్వసనీయ భర్త మరియు అనురక్తుడుగాను, ఒక విధేయ ప్రేమమయ పుత్రుడు గాను, ఒక మృదుపరిపూర్ణ సోదరుడు, జనకుడు, మిత్రుడుగాను వ్యవహరించటమే అతని కార్యం. అతడు అన్ని తరగతుల జనులకు మిత్రుడు, అతడు హీనవర్ణ గుహునికి మిత్రుడు, పశు నాయకులగు సుగ్రీవ, హనుమానులకు మిత్రుడు, గృధ్ర జీతీయుడగు జటాయువునకు మిత్రుడు, రాక్షసుడగు విభీషణునికి గూడా మిత్రుడు, అతడు ఒక భాసుర చిత్తాకర్షక అంతకంటే ఒక సహజ, అనివార్య ప్రకారమున అలా వ్యవహరించాడు గాని, [illegible] వలెనో, శిబిచక్రవర్తివలెనో ఈ ఆ గుణమును పట్టుబట్టి అవలంభించి మాత్రం కాదు. అన్నింటికంటే ఎక్కువగా, దేనిమీద సాంఘీక భావము దాని స్థిరత ఆధారపడి ఉంటాయో, అలాగే సత్య, సమ్మానాలు, ధర్మదృష్టి, సార్వజనీన తత్త్వము, వ్యవస్థాభావములకు ఏది ఆధారమో, ఆ వస్తువులను నిరూపించి స్థాపించటమే ఆయన కార్యం. చివరిగా, రావణుని ఆధిపత్యాన్ని రాక్షస భయాన్ని తుత్తునియలు గావించి, సాత్విక మానవుని ఆదర్శ జీవనానికి అనువుగా ప్రపంచాన్ని సురక్షితం చేయడమే అతని ప్రధాన కార్యం. ఇదంతా ఆయన తన వ్యక్తిత్వమునందు, కర్మయందు విలసిల్లిన ఒక దివ్యస్ఫూర్తితో అవలీలగా చేసివేశాడు. అందుచేత ఆయన మూర్తిమత్త్వము భారతీయ సాంస్కృతిక మనస్సుపైన వేసిన బలమైన ముద్ర రెండువేల సంవత్సరాలకు పైగా నిలచి ఉంది. మరియు ఆయన ఆదర్శము సర్వదేశములందు మానవుని బుద్ధి, ఆదర్శశీల మనస్సుపైన ప్రాబల్యం వహించింది. అంతేకాదు మానవుని యందలి ప్రాణమయ పురుషుడు తిరుగుబాటు చేస్తున్నప్పటికి, ఒక అధికతర ఆదర్శము ఆవిర్భవించేవరకు బహుశా ఆ ప్రాబల్యం కొనసాగుతూనే ఉంది. పోతే ఇన్ని నిదర్శనాలున్నప్పటికి, ఆయన అవతారమే కాదని నీవు అంటున్నావు ! అది నీ ఇష్టం, కాని ఎలా చూసినా, ఆయన కొద్ది మహత్తమ విభూతులలో ఒకడుగా మనముందున్నాడు. నీవిపుడతనిని గద్దెదించవచ్చు. ఏలనగా మానవుడిక ఏ మాత్రమే సాత్విక ఆదర్శముతో తృప్తినొందక, అంతకు మించినదాన్ని అన్వేషిస్తున్నాడు కాని, అలా

గద్దెదించినా, అతని కర్మ, దాని అర్థము పృధ్వి యొక్క పరిణామశీల జాతిగతంపై ముద్రితమై మిగిలి ఉన్నాయి. రాముడు లేకపోతే, ఒక వ్యవధానం (gap) ఏర్పడుతుంది. అని నేనన్నపుడు, అది ప్రవక్తలు, మేధావుల మధ్య వ్యవధానం - అని నా అర్థం కాదు. అవతారత్వ పథకమునందు వ్యవధానమని నా అర్థం. ఎలా కృష్ణుడు అధిమానస అతి మానవుని అవతారమో అలాగే సాత్విక మానవుని అవతారమొకరు గతంలో వచ్చి వెళ్ళారు. కాగా రాముడు తప్ప ఆ 'ఒకరి' స్థానమును నింపగల మరెవ్వరు నాకు గన్పించడం లేదు.

**కాళి - కృష్ణుడు**

కాళి అంటే భయంకర శక్తి రూపాన, ప్రచండ ప్రేమ రూపాన ప్రకటితమైన కృష్ణుడే. ఆమె తన ప్రచండ ప్రహారాలతో శరీర, ప్రాణ, మనస్సులలో సక్తమై ఆత్మను మర్దించి, దానిని సనాతన బ్రహ్మరూపాన విడుదల చేస్తుంది.

నేను కృష్ణుని ఉత్తమంగా ప్రేమించానా, కాళినా? అనేది నాకు కొంతకాలం తెలియదు, నేను కాళిని ప్రేమించినపుడు, అది నన్ను నేను ఇతరునిగా ప్రేమించాను, అయిన అపుడు గూడ అది నాయందే నాకు గల ప్రేమ. కావున నేను కాళిని కంటె గూడ ఎక్కువగా కృష్ణుని ప్రేమంచె స్థితికి వచ్చాను.

ఎవడు నిన్ను చిత్రహింసకు గురిచేస్తాడో, చంపివేస్తాడో, హింసా సమయము నందు, మరణక్షణమునందు గూడ వాడిలో నీవు దేవుని చూడగలవా? దేనిని నీవు చంపుతున్నావో, దాని యందు అతనిని చూడగలవా? చూచి చంపే సమయంలో సైతము దానిని ప్రేమించగలవా? అయితే పరమజ్ఞానం నీవు అందుకొన్నావు. ఎవడు కాళినెపుడూ పూజించలేదో, అతడు కృష్ణుడినెలా చేరుకోగలడు?

తన మహోగ్రమైన శక్తితోను, దహించివేసే దివ్య ప్రకృతితోను మనసత్తులోనికి దూకుతున్న కాళికాదేవి నెవరు భరించగలరు? కృష్ణుడప్పటికే ఎవరిని ఆదేశించి ఉన్నాడో, వారే భరించగలరు.

ప్రపంచం ఎప్పుడు స్వర్గం ప్రతిరూపంలోనికి మారుతుంది? భగవంతుడెపుడు కాళికృష్ణుల రూపాన దిగివస్తాడో, ఈ కాళీకృష్ణులు అందరిలోను బాలికగాను, బాలుడుగాను స్వర్గం - తోటలో కలిసి ఆడుకుంటారో, వీరితోబాటు మానవులంతా బాలబాలికలవుతారో, అప్పుడు క్రైస్తవాదుల భూలోక స్వర్గమైన ఈడెన్ - వనం గూడ చెడ్డదేమీ కాదు ! కాని ఆదాము, ఈవులు ముసలివారై పోయారు, స్వయంగా ఆ ఈడెన్‌ను పాలించే దేవుడు గూడ చాలా వృద్ధుడు,కఠినుడు, గంభీరుడు. కావున ఆదాము, ఈవులు దుష్టసర్పం కల్పించిన ప్రలోభాన్ని తట్టుకోలేకపోయారు.



# సాధకులకు - సూచనలు

యుగసంధి కాలము యొక్క ఈ చివరి 2 సంవత్సరాలలో పాటించవలసిన సూత్రాలను గురించి చర్చించాలని వుంది. స్వాతంత్ర్యము లభించిన తరువాత "నేను జైలుకి వెళ్తాను" అంటే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో, ఈ 2 సంవత్సరాల తరువాత "మేము నూతన యుగ నిర్మాణం" కొరకు పాటుపడతాం అంటే అలాగే వుంటుంది. ఆర్థిక పరిస్థితి బాగాలేదని, ఆరోగ్యము బాగాలేదని, కుటుంబంలోని ఎవరూ సహకరించటంలేదని, ఇతరులు ఎవరూ ఆదర్శంగా జీవించటంలేదని, ఈశ్వర ప్రదత్తమైన వాక్కును AK 47 రైఫిల్ లాగా వాడుతూ టెర్రరిస్టులు గాని టెర్రరిస్టుల వలె జీవిస్తూ ఏదో గురువు యొక్క శిష్యులమని చెప్పుకుంటూ (ఆ గురువు మనను శిష్యునిగా స్వీకరించిరో లేదో అనవసరము) ఏ organisation పేరుతో "నేను చెప్పేదే నిజము" పాటించవలసిన సత్యములని, ఆధ్యాత్మికత గురించి 'ఓనమాలు' కూడా తెలియని వ్యక్తులు ప్రపంచోద్ధరణకు కంకణము కట్టుకున్న ఈ తరుణములో, యుగము మార్చడమంటే, స్వయంగా మారటానికి సాహసము కావాలని, పృథ్విపై స్వర్గావతరణ జరగాలంటే జ్యోతి యొక్క బొమ్మను పట్టుకొని ఊరేగటం కాదని - స్వయంగా జ్యోతివలె మారటం అని అర్థము చేసుకొనలేని పరిస్థితులలో అన్ని ఆధ్మాత్మిక సంస్థలలోని నేతృత్వము, పేరు కావాలనే ఆకాంక్ష లేని వ్యక్తులు కూడా ఏమి చెయ్యాలో తోచక [illegible]తున్నారు.

నేను వ్రాసే ఈ పంక్తులు ఆధ్మాత్మిక సంస్థలో వున్న వ్యక్తు[illegible] ఉద్దేశించి వ్రాసినవి కావు. సాధనలో తీవ్రత తెచ్చుకొని సమర్పణ యొక్క పరాకాష్ట నందుకొని ఆ సమర్పిత వ్యక్తిత్వాన్ని 'గురుసత్తా' చేతిలో ఒక మైనపు ముద్దవలె మార్చి, ప్రజ్ఞావతరణకు కావలసిన పరిస్థితులు నెలకొల్పుకొని, నిష్కళంక కల్కి అవతారము అందచేసే బాధ్యతలను, అన్ని పరిస్థితులలోను ఎంతో ఉత్కృష్టమైన త్యాగాన్ని చేయగల పౌరుషవంతులకు ఈ వాక్యాలు వ్రాస్తున్నాను. ఏ ఆధ్మాతిక సంస్థ యొక్క ఉద్దేశ్యమైనా - పూర్వకాలపు ఋషిపరంపరకు పరాకాష్ఠగా, దధీచి నుండి ఈనాడు మన మధ్యనే జీవించియున్న శ్రీ సత్యసాయిబాబా వరకు - భూమిపై స్వర్గావతరణే ముఖ్యము. కాని అందరు ఇతరులను మార్చలనే ప్రయత్నము చేస్తున్నారు తప్ప తాను ఏ విధంగానూ మారటానికి ప్రయత్నం చేయుటలేదు. నేటి వైజ్ఞానికతను ఋషి పరంపరతో కలిపి ఒక వైజ్ఞానిక ఆధ్మాతికతను తీసుకురావటానికి, స్థూలజగత్తులో సిక్ గురువులు, మహమ్మద్, 1857 తిరుగుబాటువీరులు ప్రయత్నిస్తే, సూక్ష్మజగత్తులో - సూఫి మతస్తులు, క్రైస్తు, మీరా, చైతన్య మహాప్రభు, తులసి, త్యాగరాజు, పోతన, Saint Paul మొదలైనవారు ప్రయత్నిస్తే, మానసిక జగత్తులో కావలసిన మార్పుల కొరకు కబీరు, లాహిరి మహాశయ, యుక్తానంద, రామచంద్రజీ (షాజహాన్ పూర్), శ్రీరామకృష్ణ పరమహంస ప్రయత్నిస్తే, అతి మానస చేతనత్వ స్థాయిలో : AYN RAND, Harold Sherm Florence Shinn. John Roberts, యోగి అరవిందులు, పూజ్యగురుదేవులు పండిత శ్రీరామశర్మ ఆచార్య, సాయిపథము, తమ తమ అంశాలను (వంతును) అందిస్తున్నారు. స్థూల జగత్తు నుంచి

ప్రాణమయ కోశము అక్కడి నుండి మనోమయ కోశము, తద్వారా అతిమానస చేతనత్వము తెలిపే ప్రజ్ఞాస్థాయిని అందుకొనుటకు, పైన చెప్పిన మహానుభావులే గాక ఇంకా అనేక మంది రూపొందించిన సూత్రాలను ప్రాణవంతము చేయుటకు హిమాలయాలను కేంద్రముగా పెట్టుకొని 20,000 సంవత్సరాల కంటే ఎక్కువ వయస్సు వున్న యోగులతో ఏర్పడిన ఋషుల కూటమి, "సవితా" ద్వారా, సప్తర్షిమండల, ధృవమండల, సిరీస్ నక్షత్ర శక్తి ప్రవాహాలను సాధకులకు అందజేస్తుంది. వీరందరి సహాయము వద్దని అసలు నేను నమ్మిన స్థూల రూపధారి గురువుతప్ప, మిగతా ఎవరికీ సత్యానుభూతి లేదని నమ్మే వారికి ఏమి చెప్పగలము? సాధారణ వైజ్ఞానికతయే రోజురోజుకి తన రూపాన్ని మార్చుకుంటున్నపుడు, నిత్య, శాశ్వత, సనాతన, చేతనత్వము పరిణామక్రమములో ఎంతటి త్వరతగతిలో తీవ్రమైన మార్పులను చెందుతుందో, మనము ఊహించుకోవచ్చు.

నూతన యుగపు, వైజ్ఞానిక, ఆధ్యాత్మికతను నేర్చుకొనుటకు ముందు అతి తీవ్రమైన భావసం వేదనలను మూడింటిని మనము ఏర్పరచుకోవాలి.

1. నా ఆర్థిక వనరులకు, కుటుంబానికి నేను ట్రస్టీని మాత్రమే! ఉన్న ఆర్థిక వనరులను సత్‌ప్రవృత్తుల వికాసము కొరకు ఇతరుల మీద ఏ విధమైన ఆధారిటి చలాయించకుండా మృదుభాషణతో, నిరంతర ప్రేరణతో సాధించాలి.

2. మనము భగవంతుని ఉనికిని విశ్వసిస్తాము. గనుక ఈ ఉత్తరము అందిన క్షణము నుంచి ఆ భగవంతుని ముఖాముఖి చూడటానికి ఎంత తీవ్రప్రయత్నము చేయగలమో కాగితము, పెన్ను తీసుకొని ఒక ప్రణాళికా బద్ధముగా మనము "All out" ప్రయత్నస్థాయిలో కృషి సలపాలి. మీ ప్రయత్నానికి ఈ 2 సంవత్సరాల కాలములో అనేక పురాతన, నూతన ఋషుల ఆశీర్వాదశక్తి పనిచేస్తుంది. ఈ కార్యక్రమములో ప్రాణాయామ, జప, ధ్యాన, వ్యాయామానికి అవసరమైనచోటు (Time) కల్పించుకోండి. ఒక్కొక్కరోజు గడుస్తుంటే భగవత్ సాక్షాత్కారము పొందలేక పోయామే ఇవాళ కూడా అనే తీవ్రవ్యాకులత చెందండి.

3. భారతదేశాన్ని ఒక మట్టిగడ్డలాగా గాక ఋషులు దర్శించిన భారతమాతగా దర్శించి, **తిరిగి భారతమాతను జగద్గురు పీఠానికి అధిష్ఠాత్రిగా** చేయటానికి కావలసిన స్వాధ్యాయము రామకృష్ణ పరమహంస చరిత్రలో, వివేకానందుని రచనలలో, యోగి అరవిందుల సాధనాక్రమములో, C.V.V. , Blavatsky ల సంకల్ప బలములో, లాహిరి మహాశయ - పరమహంస యోగానంద క్రియాయోగములో, సాయితత్వ భావనలో, పూర్వకాలపు ఋషుల పరంపరలో చేతనత్వమును తిన్నగా తాకి సంస్కార పద్ధతిలో Christ యొక్క Curification లో మహ్మమద్ యొక్క Brother hood లో, జొరాష్టర్ చెప్పిన అగ్నిపూజలో, AYN RANO యొక్క Golden Path లో, Florence Shinn యొక్క Affirmations లో, E.K. గారి - జ్వాలాకూల్ ప్రేరణలో పూజ్యగురుదేవులు అందించిన ప్రజ్ఞాయుగ లక్షణాలలో ఆ భారతమాత, మాతృత్వ స్వరూపము దర్శించాలి. దీనికి నిరంతర, అవిరామ, స్వాధ్యాయము, భారతదేశ ఔన్నత్యము గుర్తుంచుకొనుట అవసరము, ఈ మూడు లక్షణాలు పెంపొందించుకొనటానికి అవిశ్రాంత ప్రయత్నము చేస్తున్నవారు, ఈ క్రింది సాధనలను ప్రాణాలయిన ఇచ్చివేయగల స్థాయిలో ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించండి. ఈ ప్రయత్నం ఒక మానసిక పొంగులాగ కాక, నిత్యజీవితములో దిగటానికి డైరీ వ్రాయటం అలవాటుచేసుకొనండి.

**చెయ్యవలసిన ప్రయత్నాలు :**

1. **సమయ సంయమము :** కనీసం 8 గంటలు సాధనా, స్వాధ్యాయ కార్యక్రమాలకు వినియోగించాలి.
2. **ఇంద్రియ సంయమము :** రసేంద్రియము, జననేంద్రియము పూర్తి నియంత్రణలో వుండాలి.
3. **వాక్ సంయమము :** సాధ్యమైనంత వరకు మనము అవసరం వచ్చినపుడే మాట్లాడుట. అది కూడా ప్రేరణ ఇవ్వటానికి, ఉత్సాహం, ఇవ్వటానికి, ప్రయత్నించాలి.
4. **అర్థ సంయమము :** ఈనాడు మనకు వ్యక్తిగతముగా వున్న ఖర్చులను బేరీజు వేసుకొని, దానిని కనీసము 50% తగ్గించుకొనటం వీలయితే సణగకుండా, బలవంతము చేయకుండా కుటుంబములోని ఇతర సభ్యులకు కూడా ప్రేరణ ఇచ్చుట, నిత్యజీవితములో క్రిందచెప్పబోతున్న నాలుగు నియమములను Guiding Light గా ఉపయోగించుకోండి.

1. **ఇంగిత జ్ఞానము (Commonsence)** : భౌతిక జగత్తులో శ్రమకు తగిన ఫలితమే లభించినపుడు, ఆధ్యాత్మిక జగత్తులో ఈ నియమాన్ని పూర్తిగా కేవలం Lip Service ద్వారా చేసే జపంవల్ల అనంతమైన లాభాలు కలుగుతాయనే మూర్ఖత్వాన్ని వదలండి, సాధన చెయ్యండి. తదనుసారం సిద్ధిని పొందండి. రు.1-00, 1-25 విలువ చేసే గోదానాలు చేయకండి.

2. **బాధ్యత (Responsibility)** : పైన చెప్పిన కార[illegible]స్తున్నపుడు వచ్చే చిరాకు కలిగించే పనులకు కాని, ఆనందపరిచే సంఘట[illegible] పూర్తిగా వ్యక్తిగతమైన బాధ్యత స్వీకరించాలి.

3. **త్రికరణ శుద్ధి (Sincerity )** : అన్ని కార్యక్రమాలను ఎంత తీవ్రముగా పాటించామో మనకి మనమే Sincere గా ఎంచుకోవాలి. నిత్యజీవతములో పై నియమాలు పాటించుకుంటూ ఉపాసన, సాధన, ఆరాధన నిర్వర్తిస్తూ 18 యుగనిర్మాణ సత్సంకల్పాలను అక్షరాలా పాటించటానికి ప్రయత్నించండి. పైన చెప్పిన 3 లక్ష్యాలు, 4 సంయమములు, 4 మార్గదర్శక సూత్రాలు, 3 సాధనా పద్ధతులు, 18 సత్సంకల్పాలు ఏ దేవతా ఆరాధకుడైన, ఏ గురువు శిష్యుడైనా, ఏ సంస్థ మెంబరయిన తన దేవతకు కానీ, గురువుకు కాని, సంస్థకు కాని ద్రోహము చేయకుండా పాటించవచ్చు. మీరు మారండి. మీ కుటుంబాన్ని, మార్చండి. మీ స్నేహితులను మార్చండి. సమాజము మారుతుంది. అంతే తప్ప మీరు మారకుండా ఒక సంస్థలో మెంబర్‌షిప్ ఉండటంవల్ల ఇతరులకంటే మీరు చాలా గొప్పస్థాయిలో ఉన్నాము అనే అహంకారాన్ని వదలి వేయండి.

4. **ధైర్యము (Courage)** : పైన చెప్పిన 3 సూత్రాలు, 4 సంయమాలు పాటించటానికి అవసరమైన ధైర్యసాహసాలను ప్రదర్శించండి. ఎందువల్లనంటే సమాజము, కుటుంబము మీలో వచ్చిన మార్పును చులకన చేసి మాట్లాడినపుడు దానికి తట్టుకొని, సాధనామార్గములో నిలబడుటకు వ్యంగ్యోక్తులను సహించటానికి చాలా ధైర్యంకావాలి.

మీ శ్రీ రామకృష్ణ

(R.K. ఏనాడో చేసిన ఈనాటి సందేశం)



# అవినీతిని ఎదిరిద్దాం

దైవం ముందు వంచవలసిన తల అవినీతి ముందు ఒక్కసారి వంచినా అవమానమే.

అవరోధం లేకుండ దారిలభిస్తూ ఉన్నంతవరకూ, ప్రతిదీ నిరాటంకంగా ముందుకు సాగిపోతూనే ఉంటుంది. "అవినీతి" కూడా అంతే. మంచికైనా, చెడుకైన ఈ నీతి చెలామణి అవటం శోచనీయం. అభివృద్ధి, ఆర్జన ఇలా చాలా చాలా వాటికోసం మనం ప్రయత్నం సాగిస్తాం. వాటితోపాటు, వాటికి అనర్థం కలుగచేసే దుష్టశక్తుల్ని కూడా మనం దృష్టిలో ఉంచుకోకపోవటంవల్ల అవినీతి నానాటికి పెచ్చుపెరుగుతుంది.

మనం నేటిపట్లా, ఎవరిపట్లా అవినీతిగా ప్రవర్తించకపోతే అంతే చాలునని తృప్తిపడిపోతే ఎలా? మనం అవినీతి ముందు తలవంచక పోవటం మరింత ముఖ్యం. మూర్ఖులు, పిరికివాళ్ళు, ఆశపరులు అవినీతికి లొంగిపోతుంటారు. మనం తప్పుచేయడం ఎంతనేరమో తప్పుజరుగుతుంటే చూస్తూ ఊరుకోవటం అంతే నేరం. అనేక పాపాలలో శారీరక మానసిక దౌర్బల్యమే ప్రముఖపాత్ర వహిస్తోంది. ఈ పాపాలనుండి రక్షణ లభించాలంటే ముందు మానసిక దారుఢ్యం, శారీరక దారుఢ్యాలను సమృద్ధిగా సంపాదించుకోవాలి. మన దౌర్బల్యం మనికిగానీ, ఇతరులకిగానీ నష్టమైనా, కష్టమైనా కల్గించే విధంగా బ్రతుకుతుంటే, ఆ బ్రతుక్కి అర్థంగానీ, పరమార్థం గానీ లేదనే చెప్పాలి.

సామాజిక జీవనంలో అనేక అన్యాయాలు, జరుగుతూ ఉండటం చూస్తూనే ఉన్నాం. వాటిని అరికట్టటానికి ప్రభుత్వస్థాయిలో గట్టి ప్రయత్నాలు జరుగుతూనే ఉండవలసి ఉంది. జైళ్ళు, కోర్టులు, చట్టాలు, సైన్యం, వీటిద్వారా వీలైనన్ని ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయి. వీటితోపాటు జనుల స్థాయిలోకూడా చేయగల్గినంత వరకూ అన్యాయాలను అరికట్టే ప్రయత్నాలు జరిగితీరాలి. అలా కానినాడు ఇవి నానాటికి పెరిగిపోయి చూస్తుండగానే అరికట్టడం సాధ్యం కానంత భయంకరంగా తయారై ఆకాశం వరకు పాకి శాంతి, స్వచ్ఛతలను సమూలంగా కబళించి వేస్తాయి.

రానురాను ఈ దుష్ప్రవృత్తుల విజృంభణ మితిమీరడం తథ్యం. కాబట్టి వీటికి వ్యతిరేకంగా మనమంతా యుద్ధానికి సిద్ధంకావాలి. ఈ ధర్మయుద్ధానికి ప్రతివ్యక్తీ నడుంకట్టాలి. ఒకప్పుడు యుద్ధభూమికి కత్తి పట్టి శిరస్సులు ఎగరకొట్టిన వారిని మాత్రమే యోధులు అనేవారు. కానీ ఈనాడు నలువైపులా వ్యాపించిన అవినీతి, అన్యాయం, అనాచారం, వీటికి వ్యతిరేకంగా పోరాడిన వారిని మాత్రమే యోధులు, వీరులుగా భావించడం జరుగుతుంది. ఈ కర్తవ్యం అందరిదీ, ధర్మరక్షణకి ప్రతీఒక్కరు పిలుపు అందుకొని తీరాలి. ధర్మాన్ని మనం రక్షిస్తేనే ఆ ధర్మం మనల్ని రక్షిస్తుంది. ధర్మానికి హానిజరుగుతుంటే మనం చూస్తూ ఊరుకుంటే మనల్ని రక్షించే దిక్కులేకుండ పోతుంది.

ఇతరులు అవినీతి పాలుబడి బాధపడుతుంటే చూసి.ఎవరికర్మను వారను భవిస్తారు. మనకెందుకులే అనవసరపు గోల అని మౌనంగా ఊరుకొనే వారు చాలామంది కనిపిస్తూనే ఉంటారు. నలుగురు గూండాలు వందలమంది మధ్య జొరబడి సర్వం కొల్లగొట్టుతుంటే మిగతాజనం తమాషా చూస్తున్నట్లు చూస్తూ ఉంటారు. మనల్ని కూడ కొడతారనే భయం, పిరికితనం ఆ అన్యాయాన్ని ఆపటానికి సాహసించనీయదు. ఈ దౌర్బల్యాన్ని ఆసరాగా తీసుకొని దుష్టశక్తులు విజృంభిస్తాయి. దోపిడి క్రమంగా హత్యలు బలత్కారాలు వరకూ పెరిగి వాటికి హద్దు లేకుండాపోతుంది. ఇంత విశాల ప్రపంచంలో ప్రజలు ఏ కొద్దిమంది ఉద్దండులకో లొంగి వారిచే బాధించబడటం శోచనీయం. ధైర్యం, నిర్భయత్వం వీటిని దుర్మార్గులు ఆశ్రయించి స్వైరవిహారం చేస్తుంటే, వారికి లొంగి తలవంచటం మానవజాతికి, దేశానికి ఎంతో అవమానకరం. ఇది మానవజాతి నపుంసకత్వానికి, నిర్జీవనానికి, పిరికితనానికి పెద్ద సాక్ష్యం.

నూటికి నూరుపాళ్ళు తన పురుషార్థాన్ని వినియోగించుకొన్నవాడే పురుషుడు అనిపించుకోవటాన్కి అర్హుడు. అంతేగాని పిరికివారు పురుషులు కాజాలరు. అన్యాయం జరుగుతుంటే చూస్తూ సహించినవాడు పౌరుషం కలిగినవాడు. పురుషుడెలా అవుతాడు? సమయం వస్తే శౌర్యం పరాక్రమంతో అన్యాయాన్ని హతమార్చి ధర్మాన్ని రక్షించటం పురుష కర్తవ్యం.

మనలో "సామూహిక తిరుగుబాటుశక్తి" లోపించ[illegible]క్కొక్కరుగా బాధించబడటం జరుగుతుంది. ఈ రోజు నీకు జరిగితే అదే అన[illegible]రొకరికి జరుగుతుంది. కానీ, నా వరకూ వస్తే గానీ నేను లక్ష్యపెట్టను. ఉపేక్షించడం వల్ల అన్యాయాన్ని ఒక్కక్కరుగా భరించటం, సహించటం, సంభవిస్తుంది. ఇతరులకి నేను, సహాయం చేయక ఉపేక్షిస్తే, రేపు నాకు ఎవరూ సహకరించలేరనే సంగతి మరిచిపోతున్నారు. ఇతరులకి జరిగే అన్యాయం అరికట్టడానికి నేను గోరంత సహాయం చేయకుండా నాకు జరిగే అన్యాయాన్ని ఇతరులు చూస్తూ ఊరుకొన్నారని నిందించడం ఎంత స్వార్థం?

ఇతరుల బాధ మనదే అనే సంగతి ప్రతీవారు గుర్తించాలి. సమాజం యొక్క పవిత్రకర్తవ్యాన్ని ప్రతి ఒక్కరూ దృష్టిలో ఉంచుకొని ఏ అన్యాయాన్నైనా ఎదుర్కోవటానికి సిద్ధంగా ఉండాలి. ఒకవేళ ఈ కర్తవ్య నిర్వహణలో నష్టం సంభవించినా అది ప్రతివారు మానవధర్మంగా భావించాలి. ఆ సహనం వీరత్వానికి, శూరత్వానికి తార్కాణం. శూరులు, వీరులు అందుకొనే బహుమానాల విలువ ఏ షరాబూ నిర్ణయించలేనిది.

మోహగ్రస్తులైన పరిజనులు ప్రలోభం వల్ల అనేక రకాలుగా కూడని పనులు చేయమని ప్రోత్సహిస్తూ ఉంటారు. తమ మూర్ఖత్వం మరియు రూఢి వాదాలతో కొందరు పెద్దవారు పిల్లల్ని చెడుమార్గాలవైపు నడిపిస్తూ ఉంటారు. వినకపోతే కోప్పడటం, శిక్షించడం చేస్తుంటారు. ఇటువంటి సమయాలలో వివేకాన్ని ఆశ్రయించాలేగాని, 'ఏమిచేయాలి' అని తలపట్టుకొని కూర్చోవటమో, భయపడి వీరికి లొంగిపోవడమో చేయకూడదు. ఎప్పుడూ మన ఆదర్శం - ఔన్నత్యం వైపు సాగనించాలే గాని అవినీతివైపు దిగజారకూడదు.

స్నేహం పేరున ప్రజలు సిగరెట్, త్రాగుడు, పేకాట, సినిమాలు వగైరా చెడు అలవాట్ల వైపు లాగాలని చూడడం సర్వసాధారణంగా జరుగుతున్న విషయం. స్నేహానికి అర్థం, స్నేహితుల్ని చెడుదారుల నుంచి తప్పించడం, ప్రగతిపథంవైపు నడిపించటంగానీ వ్యసనానికి బానిసల్ని చేయటం కాదు. కాబట్టి వారికి మన అయిష్టతనీ, అనంగీకారాన్ని నిర్మొహమాటంగా చెప్పాలి. ఇలాగే అప్పులు అడిగేవారు, ముష్టికి, దిగజారేవారు, స్వార్థంకోసం కాని పనులు చేయించేవారు, అవినీతిని వ్యతిరేకించకుండా మౌనంగా ఊరుకోమని పిరికి సలహాలు ఇచ్చేవారు, రానురాను ఇంకా వృద్ధిచెంది, మనకి అడుగడుగునా ఎదరవుతూనే ఉంటారు. నేర్పుగా తార్కికంగా మాయమాటలు చెప్పి, ఇష్టంలేని వారికి కూడ లొంగిపోయేలా ప్రలోభపెడుతూ ఉంటారు. ఇలాంటి పరిస్థితులలో మనం చాలా మెలుకువతో, సమర్థతతో వ్యవహరించి, ధైరంగా వారిని ఎదిరించి, ధర్మమార్గంలో నిశ్చలంగా నిలబడాలి. మనం పయనించే దారిలో ఎదురయ్యే ముళ్ళు, రాళ్ళుగా వారిని భావించి ఏరి దూరంగా పడవేయాలి.

దేనినైతే మనం చెడుగా గుర్తిస్తామో దానిని అంగీకరించకపోవటమే సత్యాగ్రహం. ఇది అనుచితం, అసందర్భం ఏమికాదు, చాలా అవసరం. ఇతిహాసాలలో అడుగుడుగునా కో కొల్లలుగా ఉదాహరణలు ఉన్నాయి. ప్రహ్లాదుడు, భరతుడు, విభీషణుడు, లాంటి చరిత్రలు ఖ్యాతి పొందినవి. అర్జునికి గురుజనులతో యుద్ధం చేయవలసివస్తుంది. మీరాబాయికి భర్తమాట వినని పరిస్థితి ఏర్పడుతుంది. ఇలా చాలా ఉదాహరణలున్నాయి.

తిరస్కారం, అసహయోగం, విరోధం, యుద్ధం, ఈ నాల్గుశస్త్రాలతో మనం అన్యాయాన్ని అవివేకాన్ని ఎదిరించవచ్చు. సత్యాన్ని కాపాడటం కోనం, ధర్మాన్ని రక్షించటంకోసం ఈశస్త్రాలని మనం శూరులు వీరులువలె ఉపయోగించగల్గిననాడు నూటికి నూరుపాళ్ళు ధర్మాన్ని రక్షించగల్గుతాం. సత్యదేవత కృషికి పాత్రులవుతాం.

కాబట్టి "అవినీతి నీకు తలవంచదు" అంటూ ఈనాడే ఎలుగెత్తి మనమంతా ప్రతిజ్ఞ చేద్దాం.

**ఆచరణకి ఈ క్షణమే శుభారంభం కావిద్దాం.**

**జై మహాకాల్ - జై జై మహాకాల్**



# వేమనసూక్తులు



**ఆ॥** ఇంటి వెనుక తీగ ఇంగిలీకము నుండ
పాదరసము గలిగి పసిడిరాదె।
సత్తుపొత్తు జేసి సాధింపవచ్చురా
విశ్వదాభిరామ వినురవేమ ॥

**తా॥** ఆత్మ యోగాభ్యాసంలో కుండలనీ శక్తిని ప్రాణాయామియై లేపగా సుషుమ్నే (తీగ) పలువిధ దివ్యకాంతులు (వర్ణాలు) - సప్తచక్ర - వికాసంతో పలు దృశ్యాలు ప్రజ్ఞలు - (కాంతి బయలులు) వెలిగి నలుపు, నీలిమి, తెలుపు, ఎరుపు, స్ఫటిక ప్రకాశం, పసిడి వెలుగులు, దేహం లోపల బయటా వెలయగా - బంగారు కాంతి నిత్యదృశ్యమానమై వెలయును. అట్టి కాంతియే పరబ్రహ్మ స్వరూపం. అది గాంచి తత్పరుడగు యోగి తత్త్వజ్ఞుడయి, ముక్తి నలరును గాన యోగము చెందవలే వేమా।

ఇంటి వెనుక తీగ = వెన్నుముకలోని సుషుమ్న.
యింగిలీకము= ఎరుపు, సృజన, ప్రకృతి శక్తి,
పాదరసం = తెలుపు, కుండలినీ - చిత్‌చైత్యము.
పసిడి = బంగారు రంగు
జ్ఞాన - విజ్ఞానమయ పరమాత్మ సత్తు = పరమాత్మ సత్‌విధానము.

**ఆ॥** నిమ్మపండు యుండె నిజమైన రసముండె
హేమమునకు పడ్తురేల ప్రజలు।
సత్తు పొత్తు జేసి సాధింపలేరొకో
విశ్వదాభిరామ వినురవేమ ॥

**తా॥** బంగారముండి, భాగ్యవంతుడయి మనుజుడు నిజశాంతి సుఖముల చెందలేడు. ఆత్మజ్ఞానమే నిజశాంతి, సుఖముల నిచ్చి ముక్తిని గూర్చును. ఆత్మయోగి ఆత్మ తేజముగాంచి జ్ఞానిగా సుఖించును. నిర్మల యోగాభ్యాసంతో ఆత్మను ధ్యానించగా సువర్ణపు కాంతి మండలం - (నిమ్మపండు) తెల్లని దివ్య ప్రకాశం (పాదరసం) ప్రజర్విల్ల యోగికి నిజసుఖశాంతులు జ్ఞాన లబ్ధియును చెందును. అట్టివారికి బంగారముతో పనిలేదు. అట్టి ఆత్మస్థితిని పట్టుపట్టి జనులు సాధించెదరేని ధన్యులగుదురు వేమా !

**ఆ॥** చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోన నలుసు కాలిముల్లు।
ఇంటిలోని పోరు ఇంతింత కాదయా
విశ్వదాభిరామ వినురవేమ ॥

**బాహ్యార్థము** :చెప్పులో కాలి క్రింద ఉన్న రాయి సున్నితమైన పాదములో గ్రుచ్చుకొనుచు నడుచుటకు బాధకల్గించును. చెవిలో జోరీగ దూరిన మనుజుని కలతపెట్టును. కంటిలో నలుసు పడినచో కన్ను బహుకలత పెట్టి పీడించును. కాలిలో ముల్లు గుచ్చుకొన్నచో కడు బాధించును మరియు ఇంటివారిలో పరస్పరం తగవులు మనుజునకు బహు చీకు, చింతలజేయును. ఇవన్నియు బహు బాధాకరమై, దుర్భరమై చెప్పతరముగాని ఇబ్బందులు కల్పించును వేమా !

అంతరార్థము : అచల తత్త్వము (జాయి) అయిన ఆత్మసాక్షి ఓంకార రూపమై సత్యాసత్యముల గ్రహింపజేయుచు (దీప్తమై సత్యము తెల్పుచూ) అనంతత్త్వమై యున్నది.

అట్టి ఓంకారతత్త్వము దశవిధ నాదములుగ దేహంలో నినదించుచున్నది. అది కుడి కర్ణము ద్వారా బాగా యోగి గ్రహింపనగును, కంటిలోని నల్లగ్రుడ్డులోని పాప నలుసువలె యుండి యోగసాధనవలన నాదబిందుకళాత్మకముగా ప్రకాశించును. అది నిష్కళాత్మక బ్రహ్మమునూ కల్గించును. పరమాత్మ వరిముల్లువలె సూక్ష్మమై, పీత వర్ణమయి, విద్యుల్లతవలె, దివ్యాత్మతేజమై, ఆపో జ్యోతియై, చిత్‌బయులై వెలుగుచున్నది. అది జ్ఞాన నేత్రమునకు కన్పించును. ఇట్టి యోగతత్త్వ సాధకునకు - (జ్ఞానం చెందిన యోగికి సహితం) దైవాసుర గుణములు పరస్పరం ఆధిపత్యం వహించుటకై పోరాడుచూ, తమ స్వాధీనంలో జీవుని జీవింపజేయుటకు యత్నించుచున్నది. యోగి ఇంద్రియ నిగ్రహంతో (శమ, దమ) దైవగుణయుక్తుడై (నీతి, భక్తి, వైరాగ్యాదులు) అసురగణముల (అజ్ఞానము, హింసాప్రవృత్తి, అవినీతి ఇత్యాదుల) ధర్మాలును, ఈ పోరు ఎంతో ఉధృతమై సాధకుని కలతపెట్టును. ఈనుడవబడినవన్నియు ఇటులని చెప్పుటకు వీలుగాని విశేషములై యున్నవి వేమా !

క॥ ఏ రూపున నారూపము
లోరూపున చూచుచుండ లోకారాద్యుం
డే రూపు చూచువారికి
ఆ రూపై కానిపించు నభవుడు వేమా ॥

తా॥ పరమాత్మ సర్వాధారుడు, సర్వము తానై, సర్వాతీతుడై, సర్వులచేతను, ఆరాధింపబడును, నామరూపరహిత ఓంకార పరబ్రహ్మ - పరజ్యోతి పరమాత్మ - నాత్మచైతన్య సాక్షియై, అచలబయలై సచ్చిదానందమై అభవుడై యుండి - సాకార సగుణోపాసనకూ, నిరాకార నిర్గుణోపాసనకూ సర్వాభీష్ట సిద్ధుల్తో సహా వారు కోరిన రీతి (రూపములు - పరంజ్యోతిగా - బయలుగ) ఆయా వారికి సాక్షాత్కరించి జ్ఞానమును ముక్తిని చేకూర్చును వేమా !

ఆ॥ ప్రొద్దుపొడుచు చోటు, ప్రొద్దు నిలుచు చోటు
ప్రొద్దు గ్రుంకు చోటు, పొసగ జూచి ।
ప్రొద్దెరిగినవాడు పొలుపైన యోగిరా
విశ్వదాభిరమా వినురవేమ ॥

తా॥ నిర్మల హృదయం (అంతరాత్మ)లో పరమాత్మ సూర్యకాంతి జ్ఞానతేజముగా (అనేక దివ్యకాంతులు - బాషలు) ప్రతిబింబిస్తుంది. అపుడు అది ప్రొద్దుపొడుచుటయగు అదే సూర్యకాంతి (జ్ఞాన తేజాలు) అటులే నిత్యం ప్రకాశిస్తూ చిత్‌కాంతి బయలుబరగ నిత్యదివ్యపగలు (బాహ్యరాత్రి - పగలు లేనిది) వెలయును. కాని నిర్మల హృదయంలో అజ్ఞానము, అహంకారం, భ్రాంతులు, విషయసంగ్రహం, ఇంద్రియ సుఖలోలత చెందుటచే మలినత చెంది ఆ ఆత్మ తేజస్సు మాయును. (అదే ప్రొద్దు గ్రుంకు) అయితే నిత్య సదాచారయోగనిష్ఠుడు మాత్రం దివ్యతేజ కాంతియు చిత్‌బాషలు బాషక ధ్యాననిమగ్నుడై సచ్చిదానంద మూర్తిగా ముక్తినెలయును వేమా!

గత సంవత్సరకాలంగా 'వేమనసూక్తులు' పేర అమరయోగి, గొప్ప తత్వజ్ఞాని అయిన యోగివేమనచే విరచించబడి బహుళ ప్రాచుర్యమునొందిన కొన్ని పద్యములకు చక్కని ఆధ్యాత్మిక భావవివరణను నొసంగిన పిడుగురాళ్ళ వద్దనున్న కొండమోడు నందలి ముచికుందాశ్రమాధిపతి పూజ్యులు శ్రీ శ్రీ శ్రీ వెంకట కోటి యోగీంద్రులకు కృతజ్ఞతాంజలులు అర్పించుకుంటూ ఈ నెలతో ఈ శీర్షికను ముగించుచున్నాము. త్వరలో వీరి ద్వారానే ఈ 'యుగసంధి' సమయంలో R.K. గారి పథం గురించిన చక్కని అవగాహనాత్మక వ్యాసాలు కొన్ని రాగలవని ఆశిస్తున్నాము.

# త్రిముఖీ గాయత్రీ స్థాపన

6-5-98 బుధవారము సింగరకొండ 'శ్రీ జగన్మాతృకాపీఠం' నందు ప్రపంచ చరిత్రలోనే మొట్టమొదటిసారిగా 'త్రిముఖీ గాయత్రీ స్థాపన" అనుగ్రహమాలా మంత్రదీక్షాదక్ష, ధరణీదీక్షాద్రష్ట పూజ్యగురుదేవులు శ్రీ శ్రీరామకృష్ణ గారిచే చేయబడింది. చతుర్దశ (14) భువనాల జీవులకు సాధనాస్థలియైన ఈ జగన్మాతృకాపీఠం నందు 'త్రిముఖీగాయత్రీ స్థాపన' కు అక్కడ వున్న కన్యలందరిని ముందుకురండీ అంటే ఖచ్చితంగా 14 మంది కన్యలే అక్కడ వుండటం ఆశ్చర్యం. వారందరిచే స్థాపనా కార్యక్రమం ముగిసిన తరువాత 108 కుండీల గాయత్రీ యజ్ఞము కూడా ఫలవంతమైనది. అక్కడ నెలకొల్పి నిశ్చయించిన 24 గాయత్రీమంత్రాక్షర శక్తిపీఠాలలో ఆరింటికి, బోరింగ్, మోటర్‌కు కూడా ఆ రోజే విరాళాలు ప్రకటించటం జరగటం అద్భుతం. 'ధృవనక్షత్ర సమాఖ్య' అనుబంధం అయిన ఈ జగన్మాతృకాపీఠంలో జరిగిన యాజ్ఞన్ని ఆత్మీయ మిత్రులు శ్రీ బి. సత్యన్నారాయణగారు నిర్వహించారు. ఈ కార్యక్రమానికి విచ్చేసిన మిత్రులందరికి కృతజ్ఞతలు. ఇక్కడ సమయదానం ఇచ్చుటకు ముందుకు వచ్చేవారికిదే ఆహ్వానం. అలా రాదలచుకున్నవారు. శ్రీ Y.P. రామసుబ్బయ్యగారికి గానీ లేదా యుగసంధిప్రభోధం, ఎడిటర్ గారి అడ్రస్‌కిగానీ వెంటనే తెలియజేయగలరు.





ఋషి ప్రణాళికా అవతరణ కూటమి సంకేతాలను
శ్రీ R.K. గారు ప్రారంభించిన సందర్భములోని చిత్రములు

## జీవిత సభ్యత్వం

ఈ మన 'యుగసంధిప్రబోధం' మాసపత్రిక ప్రారంభించి 3 సంవత్సరాలు నిండి 4వ సంవత్సరములోకి జూన్ 98 సంచికతో అడుగుపెట్టబోతుంది. దీనికి సదా చేయూతనిచ్చిన యుగసైనిక మిత్రులందరికివే మా కృతజ్ఞతలు. ఈ పత్రిక అతి సామాన్యుడు కూడా కొనిచదవాలనే ఆకాంక్షతోనే తొలినుండీ తక్కువ సంవత్సర చందా నిర్ణయించి నడుపుతున్న సంగతి మీకు తెలిసిందే. సర్వజ్ఞ సుందరంగా పత్రికను తీర్చిదిద్దుటకై చందాదారులను పెంచవలసి వస్తుంది. కావున జీవిత సభ్యత్వంను కూడా నూతనంగా ప్రవేశపెడుతున్నాము. **జీవిత సభ్యత్వం రూ.450/-** లు ప్రతి యుగసైనికుడూ 'యుగసంధిప్రబోధం' జీవితం సభ్యుడు కావాలి. అలాగే ప్రతి చందాదారుడు ఒక క్రొత్త చందాదారుని పరిచయం చేయాలని మా మనవి. "తలచిన ప్రతి ఆలోచన, కోరిన ప్రతి కోరికా రూపుదాల్చు జగతిలోన నియమమిదే తప్పదిక" అని R.K. గారు అందించిన ఈ వాక్యాన్ని ఒక్కసారి గుర్తుతెచ్చుకొని సంకల్పించండి. ఫలితం అదే దిగివస్తుంది.

**సంవత్సర చందా: రూ. 36/-లు - జీవిత చందా : రూ. 450/- లు**

PRINTED MATTER - BOOK POST

To

.........................................................................

.........................................................................

.........................................................................

Printed and Published by S.S.S. Siddi Anugrah Peetham Kamepalli, Editor : 1. Vijaya Bhaskar Reddy, Cross Roads, Santhamagulur (P.o. & Mandal) Prakasam Dt. Pin : 523 302

Bhuvaneswari, NRT, Ph : 22609, 23198